# స్వప్నవాసవదత్తము

తిమ్మావఝ్ఝల కోదండరామయ్య.

స్వతకుటీరము,
మదరాసు.

సారస్వతకుటీరగ్రంథమాల - 2

# స్వప్నవాసవదత్తము

Swapna Vasavadattha

[భాసకృతికి తెనుఁగు]

తిమ్మావజ్ఝల కోదండరామయ్య,
ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు,
సర్ త్యాగరాయకళాశాల, మదరాసు.



మదరాసు
1955

[మూల్యము ఒకటిన్నర రూపాయి]

నా

బ్రదుకుబాటలో

వెలుగులు నించిన

కర్మవీరుడు

కీర్తిశేషుడు

పమ్మి రామస్వామిసెట్టికి

కృతజ్ఞతాసూచకముగా

సమర్పితము.

# మనవి

స్వప్నవాసవదత్తము నింతకు మునుపు పలువురు తెలిఁగించి యుండిరి. కాని యీ తెలుఁగుసేఁతకు దానిపై నాకుఁ గలయభిమానమే కారణము.

భాసుని నాటకములలో నెల్ల నిది మేలుబంతి. ప్రాచ్య పాశ్చాత్యవిమర్శకు లందలి శిల్పమునకు ముగ్ధులై దీనిని మిక్కిలిగాఁ బ్రశంసించిరి. భాషావిద్యార్థు లందలి శిల్పము నర్థము చేసికొనుటకు వీలుగా నీ నాటకమునకు సంబంధించిన పలువిషయములనుగూర్చి తెలుపు విపుల మయినయుపోద్ఘాత మిందు రచింపఁబడినది. పయి యుపోద్ఘాతమును రచించుటలో శ్రీ ఎ. యస్. పంచాప కేశ అయ్యర్, ప్రొఫెసరు పుసల్కర్, శ్రీ జి. కె. రామసుబ్రహ్మణ్యశాస్త్రిగారల గ్రంథములు నాకు మిక్కిలిగాఁ దోడ్పడినవి. వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

నా యీ యనువాదమును మూలముతో సరిచూచి సర్వుష్టముగాఁ బరిష్కరించి యొసఁగిన సుప్రసిద్ధవిద్వత్కవులు, బహుగ్రంథకర్తలు, సహృదయవతంసులు నగు శ్రీ బులుసు వెంకటరమణయ్యగారి వాత్సల్యమునకు మిక్కిలి కృతజ్ఞుఁడను. ఏతదనువాదమునకు నన్నుఁ బ్రోత్సహించి పలుదెఱఁగుల నాకు సహాయము

గావించిన ప్రసిద్ధవిద్వత్కవులు, శతకవాఙ్మయసర్వస్వకర్తలు నగు శ్రీ వేదము వెంకటకృష్ణశర్మగారికిఁ గృతజ్ఞుఁడను.

ఏతద్ గ్రంథముద్రణసందర్భమున నాతోఁబాటు పరిశ్రమించిన చిరంజీవి త్యాగరాజమూర్తికి నాయాశీస్సులు. దీని నింత నసిగాఁ, జక్కఁగా, సర్వాంగసుందరముగా నచ్చొత్తించి యిచ్చిన 'వెల్డను' ప్రెస్సువారి నభినందించుచున్నాఁడను.

విశ్వవిద్యాలయమువారును, విద్వాంసులును దీని నాదరింతు రనియే విశ్వసింతును. ఇందలి బాగోగులను జర్చించుటకు సహృదయులు ప్రమాణము.

—తిమ్మావజ్ఝుల కోదండరామయ్య.

# ఉపోద్ఘాతము

## భాసమహాకవి

'భారవి కుంతలాళి శివభద్రుఁడు
    క్రొమ్ముడి భాసుఁ డంచలం
కారము కాళిదాసుఁడు వికాసము
    మాఘుఁడు కర్ణపూర మ
శ్రూరచరిత్రుఁ డై పరఁగుకొమ్మయ
    తిక్కఁడు దర్పణంబు సం
సారసుఖైకవాక్ప్రచురచారు
    వచస్సరసీరుహాక్షికిన్'—

అజ్ఞాతకవి యెవ్వఁడో తిక్కయజ్వ కవితయందు భారవి కాళిదాసాది మహాకవుల కవితామార్గములు దర్పణమునందుఁబోలెఁ దోఁచుచుండు నని తదీయప్రశంసగాఁ జెప్పిన యొకానొక చాటుపద్య మిది భాసకవి కవితామూర్తికిని నొక మధురనీరాజన మగుచున్నది. భాసుఁడు 'సంసారసుఖైకవాక్ప్రచురచారువచస్సరసీరుహాక్షి' యగుసరస్వతి క్రొమ్ముడి యందలి యలంకార మఁట! ఏమి సొగసైనవర్ణనము! ఎంత మధురమైనభావము! జయదేవకవి ప్రసన్నరాఘవములో—

'భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ'

అని కవితాకామిని హాసముగా భాసుని దర్శించినాఁడు!

భాసుఁడు మహాకవి! ప్రతిభామూర్తి! కళాతపస్వి! మధుమయఫణితికి వాల్మీకియట్లు సామాజికహృదయంగమదృశ్యకావ్యరచనాచాతురికి నితఁడు మార్గదర్శి. సంస్కృతమున నలంకారశాస్త్రగ్రంథములు, లక్షణ

గ్రంథములు రసస్వరూపమును వినిపింపఁగా నితని స్వప్నవాసవదత్తము రసస్వరూపమును గనిపించినది! రూపకప్రపంచమునందే యది యొక యద్వితీయసృష్టి! భాసకృతులకు సహజత, శైలీప్రసన్నత, హృద్యత యనునవి ప్రత్యేకగుణములు. అందువలననే

'భాషాసు రమ్యా గైర్వాణీ తస్యాం కావ్యం మనోహరమ్
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవేః కృతిః'

అని—భాషలలో సంస్కృతమును, నందుఁ గావ్యమును, నందు మరల రూపకమును, వానఁ దిరిగి భాసకవికృతియు రమ్యము లని భాసకృతి రామణీయకము కొనియాడఁబడుచున్నది.

ఇతఁడు రచించిన స్వప్నవాసవదత్తమును సవిమర్శముగాఁ బరిశీలించుటకు ముం దితనిగూర్చియు, నితని కృతులనుగూర్చియు నేర్పడిన వివాదముల (The Bhasa Problem) యొక్క స్వరూపమునుగూర్చి యొకింత తెలిసికొందము.

## భాసమహాకవిసమస్య

## (The Bhasa Problem)

క్రీ. శ. 1910 సంవత్సరప్రాంతమున మహామహోపాధ్యాయ, కావ్యకంఠ, శ్రీ టి. గణపతిశాస్త్రిగారు తిరువనంతపురమున భాసమహాకవి కృతులుగాఁ బదుమూఁడు రూపకముల గుఱుతించి వానిఁ బ్రకటించు దాఁకఁ బరిశోధకులకును బండితులకును సారస్వతములో నచ్చటచ్చటఁ గానిపించుప్రస్తావములమూలమున మాత్రమే భాసకవివిషయము తెలిసియుండెను. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో

'ప్రథితయశసాం భాస సౌమిల్ల కవిపుత్రాదీనాం
ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య
క్రియాయాం కథం బహుమానః'—

(ప్రథితయశస్కు లయిన భాస సౌమిల్ల కవిపుత్రాదుల ప్రబంధముల నతిక్రమించి వర్తమానకవి యగు కాళిదాసుకృతియందేల బహుమానము చూపుదువు) అని సౌమిల్ల కవిపుత్రులతోఁబాటు భాసునిఁ గూడఁ బేర్కొనినాఁడు. సూత్రధారకృతారంభములుగను, బహుభూమికములుగను నితఁడు పలునాటకములు రచించినట్లు బాణమహాకవి పేర్కొనెను. వీరు గాక యాలంకారికులు పలువు రీతని స్వప్నవాసవదత్తమును బేర్కొనిరి. అందు ముఖ్యముగా వాక్పతి, రాజశేఖరుఁడు, అభినవగుప్తుఁడు, భోజుఁడు, శారదాతనయుఁడు, సాగరనంది మొదలగువారు పేర్కొనఁదగుదురు.

భాసునిచే రచింపఁబడినవిగాఁ జెప్పఁబడు పదుమూఁడు రూపకములను ప్రధానముగా మూఁడుదెఱఁగుల విభాగింపవచ్చును. ౧. పురాణమాలికములు (Epic); ౨. బృహత్కథామాలికములు (Epic legendary) 3. కల్పితములు (Original) నని.

1. పురాణమాలికములు (Epic)

రామాయణము

౧. ప్రతిమానాటకము

౨. అభిషేకనాటకము

మహాభారతము

3. పంచరాత్రము

౪. మధ్యమవ్యాయోగము

౫. బాలచరితము

౬. దూతవాక్యము

౭. దూతఘటోత్కచము

౮. కర్ణభారము

౯. ఊరుభంగము

2. బృహత్కథామూలికములు (Epic legendary)

౧౦. ప్రతిజ్ఞాయౌగంధరాయణము

౧౧. స్వప్నవాసవదత్తము

3. కల్పితములు (Original)

౧౨. అవిమారకము

౧౩. చారుదత్తము.

వీనినే మఱికొందఱు రామాయణరూపకములు, మహాభారత రూపకములు, ఉదయనరూపకములు, కల్పితరూపకములు నని నాలుగు తెఱఁగుల విభాగము గావించిరి.

ఇవి ప్రకటింపఁబడిన పిదప నివి భాసరచితనాటకములే కావనియు, వీనిలోఁ గొన్ని మాత్రమే భాసరచితములు, తక్కినవి కావనియు, రెండు తెఱఁగు లయినవాదములఁ జేపట్టి విమర్శకలోక మీ విషయమున గొప్ప చర్చ సాగించినది. కాని నేఁటికిని నీ సమస్య పరిష్కరింపఁబడకయే నిలిచి యున్నది. ఈ పదుమూఁడు నాటకములును నేకకర్తృకములే యనుటకు సాధనములుగాఁ బ్రధానముగా నీ క్రింది సామాన్యలక్షణములు పేర్కొనఁబడినవి.

1. ఈ రూపకము లన్నిటియందును నాటకము 'నాంద్యంతంబున సూత్రధారుఁడు ప్రవేశించి' యనసూచనతోఁ బ్రారంభ మగుచున్నది.

2. నాటకప్రారంభమునఁ గావింపఁబడుప్రస్తావన (Prologue) యీతని రూపకములలో స్థాపన యని పేర్కొనఁబడినది.

3. స్థాపనలు మిక్కిలి చిన్నవిగా నుండి సంస్కృతనాటకములలో వీనియందు సామాన్యముగాఁ గానవచ్చుకవినామాదికప్రశంసయుఁ గృతి ప్రశంసయు లేక యున్నవి.

4. ఈ రూపకములలోఁ బెక్కింటియందలి నాందీశ్లోకమున ముద్రాలంకారరూపమున రూపకమునందలి ప్రధానపాత్రముల నామధేయములు సామాజికులకుఁ దెలుపఁబడుచున్నవి.

5. ఎల్ల రూపకములయందును భరతవాక్య మొకేరీతిని నున్నది.

కాని యీ సామాన్యలక్షణములును ప్రతిపక్షవాదులచేతఁ బూర్వపక్షము సేయఁబడినవి. తొలి రెండు విషయములును గేరళదేశమునందలి తక్కిన సంస్కృతనాటకములయందును గానవచ్చుచున్న వనియుఁ, గనుక నివి యన్నియు నేకకర్తృకములే యనుటకుఁ బ్రత్యేకగుణములుగాఁ జేకొనఁబడుటకు వీలులే దనియు వా రందురు. కేరళదేశపు నట్టువకాండ్రు రంగస్థలప్రయోజ్యములుగా నుండుటకై వీనిని మార్చుకొనుటచేఁ దక్కినశిల్పసామ్యము (Structural Similarities) లేర్పడి యుండవచ్చు నని వారివాదము. భాసుఁడు రచించిననాటకములనే రంగప్రయోగార్హములుగా నుండునట్లు కేరళదేశపు నట్టువకాండ్రు కుదించి వ్రాసికొని రనియు, నివి వా రట్లు వ్రాయించుకొనిననాటకము లనియు, భాసరచితము లయినమూలనాటకములు మన కింకను లభింపవలసియే యున్న వనియు, నవి యివి కా వనియు మఱికొందఱి యభిప్రాయము.

ఈ రూపకము లన్నిట రచనాశిల్ప మొకేరీతిగా నున్నది. రంగస్థలమునఁ జూపరాని వని యాలంకారికులచే నిషేధింపఁబడిన మరణము, యుద్ధము, నిద్ర, వస్త్రధారణము మొదలగునవి వీనిలో రంగస్థలముపైఁ బ్రదర్శింపఁబడినవి. పాణిని వ్యాకరణ నియమములు వీనిలోఁ బెక్కుస్థలముల నుల్లంఘింపఁబడినవి. కథాగమనము వేగముగా నుండుట (Rapidity of action) వీనియం దన్నిటఁ గానవచ్చుచున్నది. పదప్రయోగమునందును, శైలియందును వీనిలో సామ్యము చూపట్టుచున్నది. కొన్ని రూపకములలో నొక రూపకములోని వాక్యములు, శ్లోకములు నట్లట్లే మఱొకరూపకమున స్వీకరింపఁ బడినవి. ఈ యంశము లన్నియు నీ

రూపకము లేకకర్తృకము లనుటను నిరూపించుచున్నవి. కాని వీని నాకాలమున రంగస్థలముపైఁ బ్రయోగించుచుండిన కేరళదేశపు నట్టువులే సాధారణముగా నిట్టి సామ్యము లేర్పడుటకుఁ గారకు లనియు మనము తలఁచుటకవకాశము లేకపోలేదు. కనుక నివి యేకకర్తృకము లనుటకు నింకను బ్రామాణికము లగునాధారములు లభింపవలసియే యున్నవి. అందనుకఁ దాత్కాలికముగా నివి భాసరచితము లయినరూపకము లనియే యంగీకరించుట సమంజసము. తెలుఁగున భాసనాటకములు పలువురిచే సంస్కృతమునుండి యనువదింపఁ బడినవి. వా రెల్లరు నివి భాసరచితము లనియే విశ్వసించిరి.

## దేశకాలములు

అపూర్వశిల్పసమన్వితము లయినరూపకములను రచియించి రూపకప్రపంచమునం దద్వితీయఖ్యాతి గడించిన యీ మహాకవి దేశకాలములు వివాదగ్రస్తము లయి నేఁటికిని సందిగ్ధములుగా నుండుట యెంతయు శోచనీయము! విమర్శకులు కొంద ఱితఁడు కేరళదేశీయుఁ డనియు, నితని నివాసస్థలము కేరళదేశ మనియుఁ బేర్కొనిరి. మఱికొంద ఱితఁ డుజ్జయినీప్రాంతము వాఁ డని తలఁచిరి. ఇతఁ డుజ్జయినీ ప్రాంతమువాఁ డనుటయే సమంజస మని పలువుర యభిప్రాయము. తన రూపకములం దెచ్చటను నితఁడు తన్నుఁ గూర్చి యేమియుఁ జెప్పికొని యుండ లేదు. అందుచే నితని దేశకాలములు ప్రకారాంతరములచే నూహింపఁబడ వలసిన వయ్యెను. ఇతని కాలమును గూర్చి పలువురు పలుదెఱఁగులఁ జర్చలు సలిపి యుండిరి. కాని యసందిగ్ధముగా నితనికాలము నేఁటివఱకు నిశ్చయింపఁబడకయే యున్నది.

కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో భాసునిఁ బేర్కొనుటచే నితఁడు కాళిదాసుకంటెఁ బూర్వుఁ డని స్పష్టము. గుణాఢ్యుఁడు విరచించినబృహత్కథలోని యుదయనకథ నాధారముగాఁ గొని యితఁడు తన ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము ననురూపకములను-

రచించుటచే నితఁడు గుణాఢ్యునకుఁ దరువాతివాఁ డగుట తెల్లము. కనుక స్థూలముగా నితఁడు కాళిదాసుకంటెఁ బూర్వుఁ డనియు, గుణాఢ్యునికిఁ దరువాతివాఁ డనియుఁ దెలియనగుచున్నది. కాళిదాసు కాలము కూడ సందిగ్ధముగానే యుండుటచే దాని నాధారముగాఁ గొన్న భాసకాల నిర్ణయమును సంశయగ్రస్తమే కాఁగలదు. కాని కాళిదాసు క్రీ. పూ. 56 సంవత్సరప్రాంతమువాఁ డని పలువుర యభిప్రాయము. గుణాఢ్యుఁడు క్రీ. పూ. అయిదవ శతాబ్దివాఁ డగుటచే కాళిదాస గుణాఢ్యులకు మధ్య కాలములో నున్న భాసుఁడు క్రీ. పూ. మూఁడవశతాబ్దివాఁడుగాఁ దలంపఁ బడుచున్నాఁడు.

వస్తువునందు మాత్రమే కాక కవితాశైలియందును బురాణగ్రంథ ముల ప్రభావ మీతని రూపకములందుఁ గానవచ్చుచుండుటచే భాసుఁడు చాలఁ బ్రాచీనుఁ డగుమహాకవి యనుట స్పష్టము కాఁగలదు. ఇతని చారిత్రకరూపకములయందు ఉదయనుఁడు, ప్రద్యోతుఁడు, దర్శకుఁడు, ననుచారిత్రకపురుషులు (Historical figures) పేర్కొనఁబడిరి. కాని వారినిగుఱించి సయితము నిశ్చయముగా నేమియుఁ దెలియవచ్చుట లేదు. క్రీ. పూ. ఆఱవశతాబ్దికిఁ దరువాతివారు కారని మాత్రము తెలియుచున్నది. ప్రతి మలో నితఁడు బృహస్పతి యర్థశాస్త్రమును బేర్కొని కౌటిల్యునిఁ బేర్కొనక పోవుటచే నితఁడు కౌటిల్యునికంటెఁ బూర్వుఁ డని యనఁగా క్రీ. పూ. అయిదవ శతాబ్దము వాఁ డని కొందఱి యభిప్రాయము.

ఇట్లు భాసుఁడు కాళిదాసునకంటెఁ బూర్వుఁ డనుటను మించి యితని కాలమునుగూర్చి నిశ్చయముగా నిస్సంశయముగాఁ జెప్పుటకు వీలు లేకున్న దనియే చెప్పవలసి యున్నది.

## కథాసంగ్రహము

### (Summary)

పూర్వము వత్సదేశము నుదయనుఁ డనురాజు పరిపాలించుచుండెను. అతని భార్య వాసవదత్త. ఆమె యుజ్జయినీనగరాధిపతి యగుమహాసేనుని

కుమార్తె. ఒకప్పు డారుణి యనుపౌరుగు రాజొకఁడు వత్సదేశముపై దండెత్తి వచ్చి యా రాజ్యములోఁ జాల భాగము నాక్రమించుకొనెను. యౌగంధరాయణుఁ డుదయనుని మంత్రి. అతఁడు వత్సరాజు కోలుంపోయినరాజ్యమును దిరిగి సంపాదింపవలయు నని దృఢనిశ్చయుఁ డయ్యెను. బలవంతుఁ డైన యొకరాజు సహాయము లేనిదే తా నా కార్యమును సాధింపటకు వీలు కా దని యాతఁడు నిశ్చయించెను. అట్టిసహాయమును బడయుటకై యాతఁడు దర్శకుఁ డనుమగధరాజు చెల్లెలగుపద్మావతికిని, వత్సరాజునకును వివాహము జరగిన మంచి దని సంకల్పించెను. కాని వాసవదత్త జీవించియుండునంతవఱకు దర్శకుఁడు గాని, వత్సరాజు గాని యా వివాహమునకు సమ్మతింప రని తెలిసి మహామేధావి యగుయౌగంధరాయణుఁ డొక పన్నాగమును బన్నెను. ఆ ప్రయత్నమున వాసవదత్త కూడ నాతనికిఁ దోడుపడుట కంగీకరించెను.

ఒకనాఁడు వత్సరాజు వేఁటకుఁ బోయి యుండఁగా వాసవదత్త ప్రాసాదమునకు నిప్పంటింపఁబడెను. అగ్నిమధ్యమునుండి వాసవదత్తను రక్షించుటకై పోయి యామెతోఁ గూడ యౌగంధరాయణుఁడును నా యగ్నిలోఁ బడి మరణించినట్లు ప్రకటింపఁబడెను. కాని నిజమునకు వారిరువురును నంగు మరణింపలేదు. యౌగంధరాయణుఁ డొక పరివ్రాజకవేషమును ధరించెను. వాసవదత్త యావంతిక యనుపేరుతో నాతని ననుసరించెను. తపోవనమున నుండినతనతల్లిని దర్శించి మరల రాజగృహమునకు మరలిపోవుచుండిన పద్మావతిని వారిరువురును నొక తపోవనమునఁ గలిసికొనిరి. యౌగంధరాయణుఁ డప్పుడు వాసవదత్తను దన సోదరి యని చెప్పి దేశాంతరగతుఁ డైనయామె భర్త తిరిగి వచ్చువందాక నామెను బద్మావతి కడ న్యాసముగా నుంచుకొనఁ గోరును. ఆమెయు దాని కంగీకరించును. యౌగంధరాయణుఁడు వాసవదత్తతోఁ గూడఁ దపోవనమును బ్రవేశించు ఘట్టముతో నీ నాటకము ప్రారంభ మగుచున్నది. వా రందఱును నా

తపోవనమున మాటలాడుకొనుచుండఁగా యౌగంధరాయణుని చారుఁడే యొకఁడు బ్రహ్మచారి వేషముతో నచ్చటికి వచ్చి వత్సరాజు నివసించుచుండిన లావాణక మను గ్రామము కాలిపోయిన దనియు, నందు వాసవదత్తయు, యౌగంధరాయణుఁడును మరణించి రనియు, వేఁటనుండి మరలి వచ్చిన యుదయనుఁడు తన భార్య యగు వాసవదత్తకొఱకై మిక్కిలి దయనీయముగ విలపించె ననియుఁ దెలుపును. ఆ సమయమునఁ బద్మావతికి వత్సరాజుపై ననురాగ ముదయించెను.

పిదపఁ గొన్ని నాళ్ళకు వత్సరాజేదో పనిమీఁద మగధదేశమునకు రాఁగా దర్శకుఁడు తన సోదరి యగు పద్మావతిని వత్సరాజున కిచ్చి వివాహము గావించును. ఉదయనుఁడును నిరంతరము నగ్నిదగ్ధ యైన వాసవదత్తనే స్మరించుచుఁ గొంతకాలము శ్వశురగృహమునందే యుండును. తన భర్త యగు వత్సరాజెల్లప్పుడును దుఃఖాకులితస్వాంతుఁడుగ నుండుట యెఱిఁగి పద్మావతి మిక్కిలి విచారించును. ఆమె కొకనాఁడు శిరోవేదన యేర్పడెను. వత్సరాజావార్త విని యామెను దేర్చుటకై యామె తలనొప్పితోఁ బరుండి యుండిన సముద్రగృహమునకుఁ బోవును. కాని యచ్చట నామె కానరాకపోవుటచే నాతఁడచ్చోట నామెకై సిద్ధము చేయఁబడి యుండిన పడుకపైఁ బరుండి నిదురించెను. ఇంతలో వాసవదత్త పద్మావతికిఁ దలనొప్పిగా నున్న దని యెఱిఁగి యామె కుపచారము సలుపుటకై యచ్చటకి వచ్చెను. సెజ్జపైఁ బరుండి నిదురించుచుండిన వత్సరాజును బద్మావతి యనుకొని యామె యా సెజ్జపై నాతని ప్రక్కఁ గూర్చుండును. అప్పుడు వత్సరాజు నిదురలో నొక స్వప్నముఁ గాంచి వాసవదత్తను గూర్చి కలవరించును. అది విని యామె యచ్చటనుండి మెల్లగా జాఱుకొనును. అదే సమయమున నొక వార్తాహరుఁడు వచ్చి యారుణిపై దండెత్తి పోవుటకు సర్వసన్నాహములును జేయఁబడిన వని చెప్పును. అది విని వత్సరాజు వెంటనే యుద్ధమునకుఁ బోయి దర్శకుని సహాయముతోఁ దన శత్రువు నోడించి పూర్వము తాను గోలుపోయిన రాజ్యము నంతను దిరిగి పడయును. ఆ

పిదప మహాసేనునిచే నుదయనునికడకుఁ బంపఁబడిన వాసవదత్తప్రతికృతిని జూచి పద్మావతి యంతకాలముగఁ దనకడ నుండినయావంతిక వాసవదత్తయే యని గుర్తించును. ఇంతలో యౌగంధరాయణుఁ డచ్చటికి వచ్చి దర్శకుని సహాయముఁ బడయుటకై తాను పన్నినపన్నాగము నంతను వత్సరాజునకుఁ దెలిపి యెల్లరకును సంతోషముఁ జేకూర్చును. పిదప నందఱును గలిసి యుజ్జయినీనగరమునకు బయలుదేరి పోవుదురు.

## మూలము

## (The Source of the Play)

వత్సరా జగునుదయనునిగూర్చి తెలుపుప్రాచీనగాథ లౌకికసంస్కృతమునందు మాత్రమే కాక బౌద్ధజైనగ్రంథములందును విస్తారముగాఁ గలవు. గుణాఢ్యుఁ డనుకవి పైశాచీప్రాకృతభాషయందు రచించినబృహత్కథ యనుగ్రంథమున నుదయనుని గూర్చినవృత్తాంతము విశేషముగాఁ గల దని చెప్పుదురు. కాని నేఁ డాగ్రంథ ముపలబ్ధ మగుట లేదు. కాని బుద్ధస్వామి యనుపండితుఁడు రచించినబృహత్కథాశ్లోకసంగ్రహ మనుగ్రంథమును, సోమదేవకవి రచించినకథాసరిత్సాగరమును నేఁడు మనకు లభించుచున్నవి. పై రెండు గ్రంథములును పైశాచీభాషలోని బృహత్కథకు సంస్కృతానువాదము లని చెప్పఁబడుచున్నవి.

భాసమహాకవి తన స్వప్నవాసవదత్తమును రచించుటలోఁ బై గ్రంథముల నెంతవఱకు ననుసరించి యుండెనని మనము తెలిసికొనవలసి యున్నది. ఉదయనునిగూర్చి తెలుపుబౌద్ధజైనగ్రంథము లన్నియు భాసమహాకవికిఁ దరువాతికాలమున వెలసిన వగుటచేత భాసమహాకవి యా గ్రంథములలోని కథను దన నాటకమునకు మూలముగాఁ గైకొని యుండఁ జాలఁడు. క్రీ. శ. మొదటి శతాబ్దమున రచింపఁబడిన బృహత్కథ కూడ భాసమహాకవికిఁ దరువాతికాలముననే రచింపఁబడినట్లు కొందఱు పండితులు విశ్వసించుచున్నారు. కాని ప్రొఫెసర్ కీతుపండితుఁడును,

నింక మఱికొందఱును నా గ్రంథ మంతకంటెం బ్రాచీన మైన దనియు, నదియే భాసుని నాటకమునకు మూల మై యుండ నోపు ననియుం దలంచుచున్నారు. ఈ యభిప్రాయములలో నేది సత్యమో నిర్ధరించి చెప్పుటకు వీలు లేకున్నది. కాని భాసమహాకవిచే నాటకముగా రచింపఁబడిన యుదయనుని కథకును బ్రాచీనకథావాఙ్మయమునుబట్టి నేఁడు మనకుఁ దెలియవచ్చుచున్న కథకును జాల భేద మున్నట్లు మాత్రము తెలియుచున్నది. పైని పేర్కొనఁబడిన గ్రంథములను రచియించిన కవీశ్వరులవలెనే భాసమహాకవియుం దనకాలమున నానోట నానోటం జెప్పఁబడుచు నలేఖ్యములుగా నుండిన యుదయనకథలనే యాధారముగఁ గైకొని యుండవచ్చును. పై కథలు బృహత్కథాది గ్రంథములకంటెను మిక్కిలి ప్రాచీనము లైన వని చెప్పుట కెట్టి సందేహమును లేదు. కథాసరిత్సాగరమునందలి యుదయనకథకును, భాసుని స్వప్నవాసవదత్తమునందలి కథకును గలభేదములును, వానిచే నాటకమున సాధింపఁబడిన సత్ప్రయోజనములును మఱొక్కచోట వివరింపఁబడినవి.

## కథాసరిత్సాగరము—ఉదయనుని వృత్తాంతము

స్వప్నవాసవదత్తము వత్సరాజగు నుదయనుని జీవితములోని యేకదేశమును మాత్రమే ప్రదర్శించుచున్నది. వత్సరా జందు మగధరాజగు దర్శకుని సోదరి యగు పద్మావతిని వివాహమాడి తా నంతకు మునుపు గోలుపోయిన రాజ్యమును దిరిగి పొందఁ గలుగును. కాని నాటకమును జక్కఁగా నర్థము చేసికొనుట కుదయనుని పూర్వజీవితము కూడఁ గొంత తోడ్పడఁ గల దనుటలో నెట్టి సందేహమును లేదు. అందుకై కథాసరిత్సాగరములోని యుదయనుని వృత్తాంత మిచ్చుటఁ బొందుపఱుపఁబడుచున్నది.

పూర్వము సహస్రానీకుఁ డను రాజు కౌశాంబీనగరమును రాజధానిగాఁ జేసికొని వత్సదేశమును బరిపాలించుచుండెను. అతని

భార్య మృగావతి. ఆమె గర్భవతియై యుండఁగా నొకనాఁ డామె తన సౌధోపరితలమునఁ గూర్చుండి యుండెను. అప్పు డొక పక్షిరాజ మామె నొక మాంసఖండ మని తలఁచి యామెను గాళ్ళయం దిఱికించుకొని పోయి యొక పర్వతాగ్రమున వదలిపెట్టెను. అదృష్టవశమున నచ్చటి కొక మహర్షి వచ్చియుండి యామెను దన యాశ్రమమునకుఁ దీసికొని పోయెను. అచ్చట నామె కొక కుమారుఁ డుదయించెను. అతఁడు సూర్యోదయకాలమున జన్మమందుటచే నాతని కామహర్షి యుదయనుఁ డని నామకరణము చేసెను. ఆ శిశువు శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధి గాంచఁ దొడఁగెను. బాల్యము గడచి యాతఁడు యౌవనమున నడుగు పెట్టెను. వేఁట యన్నను, సంగీత మన్నను నాతఁడు చెవికోసికొనెడివాఁడు. ఒకప్పు డాతఁ డొక సర్పముయొక్క ప్రాణమును గాపాడఁగా నది యాతనిని నాగలోకమునకుఁ గొనిపోయెను. అచ్చట సర్పరాజగు వాసుకి యాతనికి ఘోషవతి యను పేరు గల వీణను బహూకరించెను. మఱియు నాతనికడనుండి యుదయనుఁ డెన్నఁడును వాడని పుష్పహారములను గట్టుటకును, వింత తిలకమును నిర్మించుటకును నేర్చుకొనెను.

తన భార్య యగు మృగావతి తన కుమారునితోఁ గూడ ఋష్యాశ్రమమున నివసించుచుండె నని విని సహస్రానీకుఁడు వారిని దిరిగి తన రాజధానీనగరమునకుఁ బిలుచుకొని పోయెను. సహస్రానీకుని యనంతర ముదయనుఁడు వత్సరాజ్యసింహాసనము నధిష్ఠించెను. యౌగంధరాయణుఁ డాతనికి ముఖ్యసచివుఁ డయ్యెను. రుమణ్వంతుఁడు సేనాధిపతి యయ్యెను. వసంతకుఁడు వత్సరాజునకు వయస్యుఁడై యాతనికి వినోదముఁ గల్పించుచుండెను. వారు మువ్వురును సహస్రానీకునికడ మంత్రులుగా నుండినవారి కుమారులు. ధీరలలితుఁ డగు వత్సరాజు నిరంతర మంతఃపురవినోదములఁ బ్రొద్దు పుచ్చుచు రాజకార్యనిర్వహణభార మంతయును యౌగంధరాయణునిపై మోపి సుఖముగాఁ గాలము గడపు

చుండెను. ఘోషవతిని మీటుచు నాతఁ డడవిలో మృగముల నాకర్షించి వేఁటాడుటయందు మిక్కిలి మచ్చట గొనుచుండెను.

ఆ కాలమున నుజ్జయినీనగరమును మహాసేనుఁ డను రాజు పరిపాలించుచుండెను. అతని కొక కుమార్తె గలదు. ఆమె పేరు వాసవదత్త. తన కుమార్తె కనురూపుఁ డగువరునికొఱకై మహాసేనుఁ డన్వేషింపఁ దొడఁగెను. వత్సరాజగునుదయనుఁ డొక్కఁడే వాసవదత్త కనురూపుఁ డగువరుఁడు. కాని మహాసేనునికిని, నుదయనునికిని బరంపరాగత మగుకులవిరోధ ముండెను. మఱియు నాభిజాత్యగర్వితుఁ డగువత్సరాజు వాసవదత్తను దన కిమ్మని మహాసేను నడుగఁ బంప లేదు. అందుచే మహాసేనుఁ డుదయను నెట్లయినను వశపఱుచుకొని యాతనికిఁ దన కుమార్తె నిచ్చి వివాహము చేయవలయు నని నిశ్చయించుకొనెను. అడవియేనుఁగులకు మచ్చిక గొలిపి వేఁటాడుటయం దుదయనునికి మచ్చట యధిక మని యెఱిఁగినమహాసేనుఁ డొక కపటగజమును నిర్మింపఁజేసి దాని కడుపున ననేకసైనికులను నాయుధములతో దాఁచి యుంచి వింధ్యపర్వతారణ్యములయందు దానిని వదలిపెట్టెను. ఉదయనుఁడు తన సేవకులవలన నాకపటగజవృత్తాంతము విని దాని వశపఱుచుకొనుటకై యరణ్యమధ్యములోనికిఁ బోయి యచ్చట ఘోషవతిని బరవశత్వముతో మీటఁ దొడఁగెను. ఇంతలో నా యంత్రగజము కడుపున దాఁగి యుండినసైనికు లాతనిపైఁ బడి మిక్కిలి కష్టముపై నాతనిఁ జెఱఁ బట్టి మహాసేనునికడకుఁ గొంపోయిరి. ఉదారహృదయుండును, దూరదర్శియు నగుమహాసేనుఁడు వత్సరాజును సగౌరవముగా సత్కరించి వాసవదత్తకు వీణ నేర్పుటకై యాతని నియమించెను. అతిలోకసౌందర్యవతి యగు వాసవదత్త మఱచిపోయి యా రాజాంతఃపురముననే నివసించుచు నామె ప్రేమామృతము ననుభవించుచుండెను. ఇంతలో రాజభక్తిసంపన్నుఁ డగుయౌగంధరాయణుఁడు తనరాజును శత్రువులబారినుండి రక్షింప

వలయు నని కృతనిశ్చయుఁ డై యొక పిచ్చివాని వేషమును ధరించి మహాసేనుని రాజాంతఃపురము వాకిటఁ బాడుచు నవ్వుచుఁ బరువులెత్తుచుఁ బిచ్చిచేష్టలు చేయఁ దొడఁగెను. వసంతకుఁడు నొక బిచ్చగానివేషముఁ దాల్చి యాతని ననుసరించెను. అంతఃపురములోని స్త్రీజనము వినోదము కొఱకుఁ బిచ్చివాని నంతఃపురములోనికిఁ గొంపోయిరి. అట్లు యౌగంధరాయణుఁ డంతఃపురప్రవేశమును బొంది యెట్లో యుదయనుని కచ్చటనుండి తప్పించుకొనుమార్గము నుపదేశించును. దానికై సర్వప్రయత్నములును నుజ్జయినీనగరములోఁ జేయఁబడి యున్నట్లు కూడ వాతఁడు వత్సరాజునకుఁ దెలిపెను. ఆరాత్రి నగరపాలకులను సంహరించి యుదయనుఁడు వాసవదత్తాసహితుఁ డై యుజ్జయినినుండి తప్పించుకొని పాఱిపోయెను. యౌగంధరాయణుఁడును, వసంతకుఁడును వారి ననుసరించిరి. మఱునాఁ డది తెలిసి మహాసేనుఁడు తన కుమారుఁ డగుగోపాలకుని వత్సరాజుకడకుఁ బంపుచు వాసవదత్తను వత్సరాజు వివాహ మాడుట తనకును సమ్మతమే యని సందేశ మంపును. కౌశాంబీనగరమున వాసవదత్తావత్సరాజుల వివాహము మహావైభవముగా జరిగెను. వత్సరాజు కొంత కాలము వాసవదత్తతో సంసారసౌఖ్యముల ననుభవించుచు నానందాబ్ధి నోలలాడుచుండెను.

కాని కొంతకాలమునకు వత్సరాజునకు వాసవదత్తపై ననురాగము సన్నగిలఁగా నతఁడు విరహిక యనునంతఃపురదాసిని బ్రేమించి యామెతో రహస్యముగఁ గ్రీడింపఁ దొడఁగెను. ఒకనాఁ డాతఁడు ప్రమాదవశమున గోత్రస్ఖలనము చేయఁగా వాసవదత్త కుపిత యై యాతనిఁ దూలనాడెను. ఆమెను బ్రసన్నురాలిగఁ జేయుటకై వత్సరాజామెకాళ్ళపైఁ బడి బ్రతిమాలుకొనెను. ఆమె కోపము తగ్గించుటకొఱకై వసంతకునిఁ బ్రోత్సహించి యామెకుఁ జక్కని హాస్యకథలు చెప్పి యామె నా వృత్తాంతము మఱచునట్లు చేయుమని వేఁడుకొనెను. క్రమముగ వసంతకుని నైపుణ్యముచే వత్సరాజెట్లో వాసవదత్త ననునయించి యామె కోపముఁ బోగొట్టెను.

అప్పటినుండి వత్సరా జనవరతము మద్యపాన, సంగీతగోష్ఠులందు వినోదించుచుఁ బ్రియాముఖదర్శనముచేఁ దన కన్నులకు విందొనగూర్చుకొనుచు రాజ్యకార్యములు మాని తన్మయముగ జీవింపఁ దొడఁగెను.

వత్సరాజు విషయలోలుఁడై యెల్లప్పుడును వాసవదత్తతోఁ గ్రీడించుచు రాజ్యమునెడ శ్రద్ధ గైకొనకుండుటను జూచి యౌగంధరాయణుఁడు మిక్కిలి వ్యాకులచిత్తుఁడయ్యెను. ఒకనాఁడాతఁడు తన మిత్రుఁ డగురుమణ్వంతుని సమీపించి 'మిత్రమా! పాండవవంశ్యుఁడైన మన వత్సరాజు రాజ్యవిస్తరణప్రయత్నమునం దాశలేకున్నాఁడు. ఇతని రాజ్యము భూమండలములో నొక మూల నెక్కడో యిమిడిగి యున్నది. కనుక స్వామిభక్తిపరాయణుల మైనమన మైనను మన కర్తవ్యమును నెఱవేర్తము. మన ప్రజ్ఞచే వత్సరాజునకు గొప్పసామ్రాజ్యమును సంపాదింతము. ఈ సంకల్పమునకు మగధదేశమును బరిపాలించు నట్టిప్రద్యోతుఁ డొక్కఁడే మన కడ్డు వచ్చుశత్రువు. అతఁడు మనలను వెనుకనుండి ముట్టడింప వచ్చును. అందుచే నాతనితో మైత్రి కుదుర్చుకొన్నయెడల మన ప్రయత్న మంతయును సఫలము కాఁగలదు. ప్రద్యోతుని కుమార్తె యగుపద్మావతిని మన వత్సరాజున కిచ్చి వివాహము చేయవలసిన దని యాతని వేఁడుదము. ఈ వివాహము జరగుటకై మన మిం కొక పనికూడఁ జేయవలసి యున్నది. వాసవదత్తను మిక్కిలి జాగ్రత్తగా నొకచోట దాఁచియుంచి యామె నివసించుచున్నప్రాసాదమునకు నిప్పంటించి వాసవదత్త మరణించినట్లు ప్రకటింపవలెను. వాసవదత్తయెడ గాఢానురాగము గలయుదయనునికిఁ దన కుమార్తె యగుపద్మావతి నీయఁ జాల నని ప్రద్యోతుఁడు వచించి యున్నాఁడు. అందుచే నింతకంటె మనకు గత్యంతరము లేదు. ఇది మాత్రమే కాక యుదయనుఁడును వాసవదత్త జీవములతో నుండునందాఁక మఱొక్కతెను జేపట్టఁ జాలఁడు. వాసవదత్త యగ్నిదగ్ధయై మరణించినవిషయము లోకములో వ్యాపించినయెడలఁ దక్కినవిషయము లన్నియుఁ గ్రమముగా జరగిపోవును. పద్మావతిని

వత్సరాజు వివాహ మాడుచోఁ బ్రద్యోతుఁడు మనలను వెనుకనుండి ముట్టడింపఁ జాలఁడు. అతఁడు మనకు బలవంతుఁ డగుసహాయుఁ డగును. మన వత్సరాజును నాతని సహాయమున గొప్ప సామ్రాజ్యమును సంపాదింపఁ గలుగును ' అని పలికెను. దృఢసంకల్పుఁ డగుయౌగంధరాయణుని పలుకులు విని రుమణ్వంతుఁడు నివ్వెఱ పోయెను. అతఁడు భయముఁ బ్రకటించుచు ' వాసవదత్త లేకున్నచో మనరాజు బ్రతుకేమగును ? ఆమె యగ్నిదగ్ధయై మృతిఁ జెందె నని విని యాతఁడు జీవించునా ? ' యని యడిగెను. కాని ప్రజ్ఞాశాలి యగుయౌగంధరాయణుఁడు రుమణ్వంతునికిఁ బొడమినసందేహముల నెల్లఁ బోఁగొట్టి తత్ప్రయత్నమున నాతఁడు పనిగొనునట్లు చేసెను.

మఱునాఁడు వా రిరువురును గోపాలకునిఁ బిలువ నంపించి యాతనికిఁ దమ సాహసప్రయత్నముఁ దెలిపిరి. అతఁడును రాజుశ్రేయస్సుఁ గోరినవాఁ డగుటచేఁ దత్ప్రయత్నమునకు సమ్మతించెను.

మఱునాఁడు యౌగంధరాయణుఁడును, రుమణ్వంతుఁడును వత్సరాజు కడకుఁ బోయి మగధరాజ్యపుఁ బొలిమేరలయందు లావాణక మనునొక గ్రామ మున్న దనియు, దానికి సమీపమున వేఁటాడ ననువగు వనప్రదేశములు విస్తారముగ నున్న వనియు, నచ్చటికిఁ బోయి కొంత కాల మందు నివసించుట మంచి దనియుఁ దెలిపిరి. మృగయావ్యసనుఁ డగువత్సరాజు వెంటనే యందులకు సమ్మతించి వాసవదత్త మొదలుగాఁ దన పరివారమును వెంటఁ బెట్టుకొని లావాణకమును జేరుకొనెను. ఒకనాఁడు వత్సరాజు వేఁటకుఁ బోయి యుండఁగా యౌగంధరాయణుఁడు, రుమణ్వంతుఁడు, వసంతకుఁడు, గోపాలకుఁడు-వాసవదత్తకడకుఁ బోయి రహస్యముగ నామెకుఁ దమ ప్రయత్నమునుగూర్చి తెలిపి యాప్రయత్నమునఁ దమకు సహాయపడ వలసినదిగా నామె నర్థించిరి. తన భర్తతోడి వియోగమును, దన భర్త మఱొక్కతెను వివాహ మాడుటయుఁ దనకు భరింపరాని కార్యములే

యుండెనను నుదారాశయయుఁ, ద్యాగశీలయు నైనవాసవదత్త వారి ప్రయత్నమునందుఁ దోడ్పడ నంగీకరించెను. అంత యౌగంధరాయణుఁడు వాసవదత్త కొక బ్రాహ్మణివేషమును ధరింపఁ జేసి వసంతకుని కొంటికంటి బ్రాహ్మణబాలుని వేషము వేయించి తా నొక వృద్ధబ్రాహ్మణవేషమును ధరించెను. వారు ముువ్వురును మగధకుఁ బయనమై పోయిరి. వాసవదత్త తన శరీరముతో ముందునకు నడచి పోవుచుండినను నామె హృదయమంతయును వత్సరాజుపైనే యుండెను. ఇంతలో రుమణ్వంతుఁ డామె నివసించుచుండినప్రాసాదమునకు నిప్పంటించి వాసవదత్త వసంతకుఁ డను విదూషకునితోఁ గూడ నందు మరణించె నని యెలుఁగెత్తి ప్రకటించెను.

యౌగంధరాయణుఁడు వాసవదత్తావసంతకులతో మగధదేశపు రాజధానిం జేరెను. అచ్చట వారు ప్రద్యోతుని కుమార్తె యగుపద్మావతి నొక యుద్యానవనమునఁ గాంచి సేవకు లడ్డగించుచున్నను నెట్లో ప్రవేశము కల్పించుకొని యామెను సమీపించిరి. బ్రాహ్మణివేషమును దాల్చియున్న వాసవదత్తను జూచినంతనే పద్మావతి కామెయెడ నవ్యాజమైనయనురాగ మేర్పడెను. అంత నామె యావృద్ధబ్రాహ్మణుని 'అయ్యా! యీ బ్రాహ్మణి యెవ్వరు ? మీ కేమి కావలయును ?' అని యడిగెను. అందులకు యౌగంధరాయణుఁడు 'అమ్మా! యీమె నా కుమార్తె అవంతిక. ఈమె భర్త యీమెను వదలిపెట్టి దేశాంతరగతుఁ డయ్యెను. ఈ బాలుఁడు నా కుమారుఁడు. నేను నా యల్లుని వెదకి తెచ్చుటకై పోవుచుంటిని. నేను మరలి వచ్చునందాక నా కుమార్తెను మీ కడ న్యాసముగ నుంపఁ గోరుచున్నాను' అని పలికెను. పద్మావతియు నందులకు సమ్మతించి వాసవదత్తను న్యాసముగఁ బరిగ్రహించెను. యౌగంధరాయణుఁడును లావాణకమునకు వచ్చి చేరుకొనెను. తనకడ న్యాసముగ నుంపఁబడినబ్రాహ్మణి యాభిజాత్యము గల దగుట యెఱిఁగి పద్మావతి యామెను మిక్కిలి గౌరవముతో నాదరించుచుఁ దనతో సమానముగ

నామెకు సర్వసౌఖ్యములను గల్పించుచుండెను. కాని వాసవదత్త మాత్రము భర్తృవియోగముచే విరహకృశయై నానాటికి సన్నగిల్లిపోవుచు విచారగ్రస్తయై యుండెను. వసంతకుఁ డామెకడనే యుండి తనహాస్యముచే నామెకు నవ్వు పుట్టించుచు విచారమును బోఁగొట్టుచుండెను.

ఇట్లుండ వేఁటకుఁ బోయి యుండినవత్సరాజు వేఁటనుండి రాత్రి ప్రొద్దుపోయినపిదప మరలి వచ్చి తన మంత్రులవలన వాసవదత్తయు, వసంతకుఁడును నగ్నిలోఁ బడి మరణించి రని తెలిసికొని మూర్ఛఁ జెందెను. ఆతనివెంట నుండినమంత్రు లాతని సేదదేర్చిరి. కొంతవడి కాతఁడు మూర్ఛనుండి తేరుకొని నారదమహర్షి యొకప్పుడు వాసవదత్తవలనఁ దన కొకకుమారుఁడు కలుగు ననియు, నాతఁడు సార్వభౌముఁడు కాఁగలఁ డనియుఁ జెప్పినమాటలు గుర్తునకు రాఁగాఁ గొంత యూఱడిల్లెను. యౌగంధరాయణుఁడు మొదలగుమంత్రులును, వాసవదత్తసోదరుఁ డగుగోపాలకుఁడును దుఃఖింపవలసినంతయెక్కువగా దుఃఖితులు కాకుండుట చూడఁగా వత్సరాజున కేదో యనుమానము దోఁచెను. ఇదేదో తన మంత్రులు పన్నిన పన్నాగ మని యెంచి వత్సరాజు తన దుఃఖమును లోలోననే యడఁచుకొని వాసవదత్తను దిరిగి యెప్పుడో యొకప్పుడు పొందఁగలుగుదు నని యాశించుచుండెను.

ఇంతలో లావాణకమున నుండినప్రద్యోతుని చారు లాతనికడకుఁ బోయి వాసవదత్త యగ్నిదగ్ధయై మరణించినవిషయము నాతనికిఁ దెలిపిరి. తగినతరుణముకొఱకై యెదురు చూచుచుండినప్రద్యోతుఁడు వెంటనే తన కుమార్తె యగుపద్మావతిని వివాహ మాడవలసిన దని కోరుచు వత్సరాజు కడకు సందేశ మంపెను. వత్సరాజు యౌగంధరాయణుని సలహా మేరకుఁ బద్మావతిని వివాహ మాడుటకుఁ దనసమ్మతిని దెలిపెను. వాసవదత్తను దన మంత్రులు దాచియుంచుటకు బహుశః యదియే కారణ మయి యుండు నని యాతఁడు భావించెను. పద్మావతియుఁ దన కనురూపుఁ డగుభర్త

లభించినందులకు మిక్కిలి సంతోషించెను. కాని వాసవదత్త యావార్త విని మిక్కిలి దుఃఖించెను. వసంతకుఁ డామె నెట్లో యూరడించెను. పిదప వాసవదత్త పద్మావతికొఱకై యెన్నఁడు వాడనిపూలమాలను, వింత తిలకమును దానే స్వయముగ సిద్ధము చేసెను. ఇది జరిగినయెడవనాఁడు వత్సరాజు మగధకు వచ్చి పద్మావతిని బరిగ్రహించెను. అప్పుడు యౌగంధరాయణుఁడు ప్రద్యోతునిచే నగ్నిసాక్షికముగఁ దనయల్లుని కప్పుడును వానిఁ గలుగఁజేయు నని ప్రతిజ్ఞఁ జేయించెను. అంతదాఁక నెవ్వరును వాసవదత్తను గుర్తింప రైరి. వాసవదత్తయుఁ బగటియందు దడఁగియున్నచంద్రబింబము వలెఁ దనభర్తకు శ్రేయముఁ గోరుచు నా రాజగృహమున నొకచోట నొదిఁగి యుండెను.

అంత యౌగంధరాయణుఁడు రాజగృహములోనే యుండినవాసవదత్తను వత్సరాజు చూచుట సంభవించినయెడల రహస్య మంతయు బట్టబయ లగు నని భయపడి యా దినమే లావాణకమునకు బయలుదేరి పోవుట మంచి దని వత్సరాజును, బద్మావతిని బ్రోత్సహించెను. వాసవదత్తయుఁ బద్మావతిచేఁ బంపఁబడిన యొక శకటముపై నామె పరివారములోఁ గలిసి యామె వెంటఁ బోయెను. వసంతకుఁ డంతకుఁబూర్వమేగోపాలుని గృహముఁ జేరుకొనెను. పద్మావతివెంటఁ బరివారముతోఁ గూడఁ బోవుచుండినవాసవదత్త తన చెలికత్తెలను బంపివైచి తన సోదరుఁ డగుగోపాలకుని గృహముఁ బ్రవేశించెను. ఆ చెలులు పద్మావతికడకుఁ బోయి యావంతిక తమ్మున్నట్టుండి పంపివేసిన దనియుఁ, బిదప నామె గోపాలకుని గృహముఁ బ్రవేశించిన దనియుఁ దెలిపిరి. పద్మావతి యది విని యాశ్చర్యచకిత యయ్యెను. ఆమె వారిని దిరిగి యావంతికకడకుఁ బంపి యామె తన న్యాస మగుట దెలిపి వెంటనే తీసికొని రావలసినదిగా నాజ్ఞాపించెను.

వత్సరాజు పద్మావతి ధరించియుండినపుష్పహారమును గాంచి "దేవీ! యెన్నఁడును వాడిపోని యీ పుష్పమాలికను నీ కెవ్వరు కూర్చిరి?"

అని ప్రశ్నించెను. ఆమెయుఁ దనకడ నొకానొక బ్రాహ్మణునిచే న్యాసముగా నుంపఁబడినయావంతిక దానిఁ దనకుఁ గూర్చి యిచ్చె నని నుడివెను. ఇది వినినవెంటనే వత్సరా జామె తప్పక వాసవదత్త యయి యుండు నని భావించి గోపాలకుని యంతఃపురమునకుఁ బోయెను. అచ్చట నాతఁడు తన భార్య యగువాసవదత్తను, గోపాలకునిఁ, దన మంత్రులను గలిసికొనెను. వాసవదత్తను జూచినవెంటనే యామెమీఁది యనురాగమున వత్సరాజు పరవశుఁడై నేల మూర్ఛితుఁడై పడెను. వాసవదత్తయుఁ దన చేష్టితమును దానే నిందించుకొనుచు విలపించి విలపించి తుదకు మూర్ఛఁజెందెను. వారిరువురి ప్రణయబంధమును జూచి వారి యెడఁబాటునకుఁ గారణభూతుఁడైన యౌగంధరాయణుఁడు కన్నీరు కాలువలు గట్ట నేడ్వఁ దొడఁగెను. పద్మావతియు నావృత్తాంతముఁ దెలిసికొని యచ్చటికి వచ్చెను. ఆమెయు జరగిన విషయము నంతను దెలిసికొని 'వాసవదత్తకును, వత్సరాజునకును నెడబాటు కలుగుటకుఁ నేను గారణభూతురాల నైతిని గదా' యని విలపించెను. యౌగంధరాయణుఁ డప్పుడు వత్సరాజుతో "రాజా! నిన్ను సార్వభౌమునిగఁ జేయుటకొఱకే నే నిది యంతయుఁ జేయవలసి వచ్చినది. పద్మావతిని వివాహ మాడినఁ గాని ప్రద్యోతుని సహాయము నీకు లభింప దని యీ పన్నాగము పన్నితిని. ఇందు వాసవదత్త తప్పేమియును లేదు. ఈమె శీలమునకుఁ బద్మావతియే యింతకాలము పూఁటగా నుండినది" యని పలికెను. పద్మావతియు వాసవదత్తయెడఁ దనకుఁ గలగౌరవమునుఁ బ్రకటించుచు "ఆమె సచ్ఛీలమును నిరూపించుట కగ్నిప్రవేశముఁ జేయుట కైనను నేను సిద్ధముగా నున్నాను" అని పలికెను. అప్పు డొక యాకాశవాణి యిట్లు వినవచ్చెను. 'ఓరాజా! యౌగంధరాయణునివంటి మంత్రియు, వాసవదత్తవంటి భార్యయుఁ గలుగుటచే నీవు మిక్కిలి యదృష్టవంతుఁడవు. వాసవదత్త సచ్ఛీల. పతివ్రత. ఆమెయం దట్టి కళంకమును లేదు." వత్సరాజు తన యిరువురు భార్యలతోను జిరకాలము సుఖ ముండెను.

# మార్పులు

## (Deviations in Bhasa's Version)

భాసమహాకవి రచించినస్వప్నవాసవదత్తమునకు బృహత్కథ మూలమగునో కాదో నిశ్చయముగఁ జెప్పఁజాలము. కాని బృహత్కథకు సంస్కృతానువాదములగు కథాసరిత్సాగరములోఁ జెప్పఁబడిన పై కథకును, భాసుఁడు తననాటకములందుఁ జిత్రించినకథకును గొన్ని ముఖ్యమైన భేదములు కానవచ్చుచున్నవి.

కథాసరిత్సాగరములోఁ బద్మావతిని వత్సరాజు వివాహమాడునట్లు చేయుటలో యౌగంధరాయణుని యుద్దేశము రాజ్యవిస్తరణము మాత్రమే. ప్రద్యోతుఁ డొక్కఁడే వత్సరాజునకుఁ బ్రబలశత్రువుగా నుండుటచే నా యాటంకమును దొలఁగించుకొనుటకొఱకై యౌగంధరాయణుఁడు పద్మావతీ పాణిగ్రహణమును సంకల్పించినట్లుగఁ గథాసరిత్సాగరమునఁ గలదు. కాని స్వప్నవాసవదత్తమున నీవిషయము వేఱువిధముగా నున్నది. ఆరుణి యను రాజు వత్సరాజ్యమునఁ జాలభాగము నాక్రమించుకొనఁగా నుదయనుఁడు తాను గోల్పోయిన యా రాజ్యభాగము నంతను దిరిగి పొందుటలోఁ బద్మావతిసోదరుఁ డగుదర్శకుని సహాయముఁ బడయుటకే పద్మావతీవివాహమును యౌగంధరాయణుఁడు తలపెట్టినట్లుగ నిందుఁ గలదు. భాసుఁడు చేసిన యీ మార్పు నాటకీయప్రభావము గలిగి సామాజికహృదయములఁ జూఱగొనుచున్న దనుటలో సందేహము లేదు. ఈ మార్పువలన యౌగంధరాయణుని శీల ముదాత్తముగఁ బోషింపఁబడుచున్నది. ఇందు యౌగంధరాయణుఁడు తనరాజు గోల్పోయినరాజ్యమును దిరిగి సంపాదించి యాతనిని రాజ్యమునఁ బునఃప్రతిష్ఠితునిఁ జేయుస్వామిభక్తిపరాయణుఁడు గాఁ జిత్రింపఁబడినాఁడు. కథాసరిత్సాగరములో వట్లు కాక యాతఁడు రాజ్యవిస్తరణముకొఱకై పేరాసకొన్నమంత్రిగా మనకుఁ గానవచ్చుచున్నాఁడు. ఇందుచే వాసవదత్తను దాచియుంచుటయు, నామె భర్తకై చేసిన త్యాగ

మును మఱింత సమర్థనీయము లగుచున్నవి. ఈ మార్పునుబట్టి మఱొక్క మార్పు గూడ స్వప్నవాసవదత్తమునఁ జేయవలసి వచ్చినది. పద్మావతిని వివాహ మాడినతరువాత నుదయనుఁడు మగధయందే కొంతకాలము వసించును. ఆసమయమున నాతని మంత్రు లారుణితో యుద్ధమునకు సర్వప్రయత్నములను జేయుదురు. దర్శకుని సహాయమున నుదయనుఁడు వత్సరాజ్యమును దిరిగిపొందినపిదపనే వాసవదత్త యాతనిఁ జేరును. కథాసరిత్సాగరమున నట్లు కాక వత్సరాజు తన వివాహము ముగిసినవెంటనే కౌశాంబికి మఱలివచ్చును. మార్గమధ్యమున గోపాలకుని గృహమున వాసవదత్తను గుర్తించి యాతఁ డామెను బరిగ్రహించును. ఆతరువాతనే వత్సరాజు ప్రద్యోతుని సహాయముతో దిగ్విజయయాత్రఁ జేయును.

ఇవి కాక మఱికొన్ని మార్పులు గూడ స్వప్నవాసవదత్తమునఁ జేయఁబడినవి. వాసవదత్తావత్సరాజుల చిత్రపటముల వృత్తాంతము కథాసరిత్సాగరమున లేదు. వసంతకుఁడు కథాసరిత్సాగరమునందువలె వాసవదత్తతోఁ గాక యిందు వత్సరాజుతోఁ గూడ నుండును. మఱియుఁ గథాసరిత్సాగరమునఁ బద్మావతి మగధరాజుప్రద్యోతుని కుమార్తెగాఁ జెప్పఁబడినది. స్వప్నవాసవదత్తమున నామె మగధరాజుదర్శకుని సోదరిగాఁ జిత్రింపఁ బడినది.

## నామౌచిత్యము

### (The Title of the Play)

స్వప్నవాసవదత్త మను నీ నాటకమున కా నామ మెంతవఱకు సముచితముగ నున్నదో యించుక పరిశీలింతము. ఇందలి పంచమాంకములోని యొకానొకసన్నివేశమునుబట్టి దీనికీపేరు వచ్చినది. అందు వత్సరాజగు నుదయనుఁడు నిదురలో వాసవదత్తను గాంచి కలవరించును. అప్పుడు పద్మావతికిఁ దలనొప్పిగా నున్నదని యామె కుపచారము సేయుటకై యచ్చ

వచ్చినవాసవదత్త సెజ్జపైఁ బరుండి యుండినవత్సరాజును బద్మావతి యని భావించి యా సెజ్జపైఁ గూర్చుండును. అపు డాతఁడు వాసవదత్తనుగూర్చి కలవరింపఁగా నామె యపుడు తాను జేసినతప్పెఱిఁగి యచ్చటినుండి మెల్లగా జాఱుకొనును. నిదురనుండి మేలుకొనినవత్సరాజు వాస్తవముగ వాసవదత్తను జూచియు నామెను స్వప్నములోఁ గాంచినట్లే భ్రమించును. ఈరసవత్తరసన్నివేశమునుబట్టి యీ నాటకమునకు స్వప్నవాసవదత్త మని పేరు వచ్చినది. కాని సంస్కృతనాటకములయందు సాధారణముగఁ బ్రస్తావనలయందు నాటకముపేరు పేర్కొనఁబడునట్లుగ నీ నాటకమందలి స్థాపనయం దీపేరు పేర్కొనఁబడ లేదు. ఒకానొకతాళపత్రములో మాత్రము కట్టకడపట "ఇతి స్వప్ననాటక మవసితమ్" అని కలదు. భాసమహాకవి రచియించిన పదుమూఁడు నాటకములను దొలిసారిగాఁ బ్రకటించిన మహామహోపాధ్యాయ శ్రీ టి. గణపతి శాస్త్రిగారు భాసునికాలమునాఁటి నాటకములలోఁ బ్రస్తావనలయందు నాటకనామము పేర్కొనెడిసంప్రదాయముండెడిది కా దనియు, నందుచేతనే స్వప్నవాసవదత్తములోని స్థాపనలో నాపేరు పేర్కొనఁబడలే దనియుఁ జెప్పుచున్నారు. మఱియు నాటకాంతమునఁ గానవచ్చు "స్వప్ననాటక" మనునది స్వప్నవాసవదత్త మనుటకు సంగ్రహరూప మనియు వారి యభిప్రాయము. దీనిఁ బట్టియు, నింక మఱికొన్ని యాధారములఁ బట్టియు మఱొక్కవాదము కూడ నాతరువాత బయలుదేరినది. మనకు నేఁ డుపలభ్య మగుచున్న స్వప్ననాటక మనునది భాసమహాకవి రచియించినస్వప్నవాసవదత్తముయొక్క సంగ్రహరూప మనియు, నందుచే నీ స్వప్ననాటకము భాసరచితము కానే కా దనియు, భాసుఁడు రచియించినస్వప్నవాసవదత్త మింకను మనకు లభింపవలసియే యున్న దనియుఁ గొందఱు వాదించుచున్నారు. కాని చాలమంది పండితు లీ స్వప్ననాటకమే స్వప్నవాసవదత్తనాటక మని నేఁటికిని దలఁచుచున్నారు.

"స్వప్నవాసవదత్తము" అనుసమాసము వ్యాకరణదుష్టము. స్వప్ననాటక మనునదియే సరి యయినరూపము. 'స్వప్నప్రధానం నాటకం స్వప్న

నాటకం' అని దానికి విగ్రహవాక్యము చెప్పఁదగును. స్వప్ననాటక మను నీ పేరు నాటకములోని ప్రధానకథకు సాక్షాత్తుగా సంబంధించినది గాక పోయినప్పటికిని, నాటకములోని యొక చక్కని నాటకీయసన్నివేశమును బేర్కొనుచుండుటచే నిది మిక్కిలి సముచితముగా నున్నదని చెప్పుట కెట్టి సందేహమును లేదు. పయి స్వప్నసన్నివేశము కన్నులకుఁ గట్టినట్లుగాను, రసవత్తరముగాను జిత్రింపఁబడుట మాత్రమే కాక నాటకీయ మైనప్రయోజనమును గూడ సిద్ధింపఁజేయుచున్నది. ఈ స్వప్నసన్నివేశము బృహత్కథయందుఁ గానరాదు. భాసమహాకవి స్వకపోలకల్పిత మైనయద్భుతసృష్టి యిది !

## కథావిమర్శము

## (Argument of the Play)

యౌగంధరాయణుఁడును, వాసవదత్తయు మాఱువేషములతో మగధదేశమునకుఁ బోయి యచ్చట నొక తపోవనమునఁ బద్మావతిని గలిసికొనుటతో నీ నాటకము ప్రారంభ మగుచున్నది. పద్మావతీవత్సరాజుల వివాహముమూలమున వత్సరాజు తాను గోలుపోయినరాజ్యమును దిరిగి పొందుట యనెడి నాటకప్రయోజనబీజము క్రమక్రమముగ నొక్కొక్క యంకములోను విరివి సెంగుచునని నాటకకర్త మిక్కిలి నేర్పుతోఁ జిత్రించినాఁడు. మఱియు వాసవదత్తాపద్మావతుల హృదయములయందుఁ బరస్పరము ప్రేమాదరములు నెలకొనఁజేసి వారిరువురును దరువాత వత్సరాజు రాణులుగ సహజీవనము సలుపఁదగినయవకాశము కూడ నిందుఁ జక్కఁగాఁ గల్పింపఁబడినది. నాటకములోని యితరపాత్రముల గుణశీలములు కూడ నిందు మిక్కిలి ప్రతిభావంతముగాఁ బ్రదర్శింపఁ బడినవి.

## ప్రథమాంకము

మగధరాజగుదర్శకుని సోదరి యగుపద్మావతి తపోవనమున నివసించుచుండినరాజమాతను దర్శించి తిరిగి రాజగృహమునకు మఱలి పోవుచు

మార్గమున నొక తపోవనమునందు విశ్రమించెను. అప్పు డామె వెంట నుండినభటు లా యాశ్రమములోని తపస్వులను మిక్కిలి క్రూరముగా నచ్చటినుండి తొలఁగించుచుండిరి. ఆ సమయమునఁ బరివ్రాజక వేషమును దాల్చినయౌగంధరాయణుఁడును, నావంతిక వేషమును ధరించి యుండిన వాసవదత్తయు నా తపోవనమునఁ బ్రవేశింతురు. వా రిరువురును దపస్విజనులయెడ మగధరాజభటులు సూపుచుండినక్రూరప్రవర్తనమును గన్నులారఁ గాంతురు. ఆ సందర్భమువలన నిరుత్సాహముఁ జెందినవాసవదత్త తన్నుఁ బద్మావతికడ న్యాసముగా నుంపఁ దలఁచిన యౌగంధరాయణుని ప్రయత్నము కొనసాగ దేమో యని భయ మందసాఁగెను. కాని యౌగంధరాయణునికి మాత్రము తన కార్యవిజయముపట్ల నెట్టి సందేహమును లేదు. అతఁడును దపస్విజనులను మగధరాజభటులు తొలఁగించుచుండుటను జూచి తొలుత మిక్కిలి బాధపడెను. సంపదలనుండి తమ్ముఁ దాము తొలఁగించుకొనువారే తపస్విజనుల నట్లు తొలఁగఁ జేయుదు రని యాతఁడు పలికెను. విషణ్ణహృదయ యై యున్న వాసవదత్త నాతఁ డూఱడించి తనభర్తకును, రాజ్యమునకును క్షేమమును గూర్చుటకై యామెయే యా ప్రయత్నమునకు ముందుగాఁ బూనుకొనినవిషయము నామెకు జ్ఞప్తికిఁ దెచ్చెను.

అప్పు డొక కాంచుకీయుఁడు వచ్చి మగధరాజపుత్రి యగుపద్మావతి తపోవనమున నివసించుచుండినరాజమాతను దర్శించి తిరిగి రాజగృహమునకు మఱలిపోవుచున్న దని ప్రకటించును. అది విని యౌగంధరాయణుఁడును, వాసవదత్తయుఁ బద్మావతి తమ చేరువనే యున్న దని తెలిసి మిక్కిలి సంతోషింతురు. ఇంతలోఁ బద్మావతి తన పరివారముతోను, దాదితోను, దాపసితోను వారికిఁ గానవచ్చును. పద్మావతి సౌందర్యమును జూచి వాసవదత్త ముగ్ధురా లగును. తాపసి పద్మావతి నాశ్రమములోని కాహ్వానించి గౌరవించును. పద్మావతియు మిక్కిలి శ్రద్ధాభక్తులతో నా తాపసియెడ గౌరవాదరములు ప్రకటించును. అప్పుడు వాసవదత్త తనలో

“ఈమె రూపమే గాక యీమె మాటలు గూడ మిక్కిలి మధురములుగా నున్నవి” అని తలపోయును. తాపసియును, బద్మావతియును మాటలాడుకొనిన మాటలనుబట్టి వాసవదత్త-యపుడు తనతండ్రి యగుప్రద్యోతుఁడు తన కుమారునికిఁ బద్మావతి నిమ్మని దర్శకునికడకుఁ గబురు పంపినట్లు తెలిసికొని పద్మావతి దానిమూలమునఁ దన కాత్మీయురాలే యగుచున్నందులకు మిక్కిలి సంతోషించును.

పద్మావతి కోరికప్రకారము కాంచుకీయుఁ డపుడు తపస్విజనులు తమ కేమేమి కావలయునో కోరవచ్చుననియుఁ బద్మావతి వారికోరికలను దీర్చుటకు సిద్ధముగా నున్న దనియుఁ బలుకును. యౌగంధరాయణుఁ డా యవకాశమును బురస్కరించుకొని కొంతకాలము తన సోదరి యగునావంతికను బద్మావతి తనకడ న్యాసముగా నుంచుకొని రక్షింపవలయు నని కోరును. కాంచుకీయుఁడు న్యాసరక్షణము కష్టకార్య మని వారించుచున్నను వినక పద్మావతి యౌగంధరాయణునికిఁ దన సమ్మతిని దెలుపును. క్రొత్తచోట మాఱువేషముతో రహస్యముగ జీవయాత్ర గడుపవలసి వచ్చినందులకు వాసవదత్త తన మనస్సులో మిక్కిలి దుఃఖించును. యౌగంధరాయణుఁడు మాత్రము వాసవదత్తను బద్మావతి కప్పగించి సగముబరువు తీరిన దని నిశ్వసించును.

ఆ సమయమున యౌగంధరాయణుని చారుఁ డొక్కఁడు బ్రహ్మచారివేషమును దాల్చి యా తపోవనమునఁ బ్రవేశించును. అచ్చట నున్న వా రందఱును నాతని లోనికి నాహ్వానించి సత్కరింతురు. అప్పుడు యౌగంధరాయణుఁడు బ్రహ్మచారితో మాటలాడుట కుపక్రమించి యాతని నివాసస్థలమునుగూర్చియు, నాతఁ డాస్థలమును వదలిపెట్టి వచ్చుటకుఁ గలకారణమునుగూర్చియుఁ బ్రశ్నించి యంతకుఁ బూర్వమే యాతఁడు నేర్చియుంచినకథనుఁ జెప్పుటకవకాశముఁ గల్పించును. బ్రహ్మచారియుఁ దాను లావాణకమున నధ్యయనముఁ జేయుచుంటి ననియు, నా గ్రామము దగ్ధమైపోవుటచేఁ దాను దాని వీడి హఠాత్తుగ రావలసి వచ్చె ననియుఁ దెలుపును. ఉదయనుఁ డనురా జా గ్రామమున నివసించుచుండె ననియు. నతఁడు

వేటకు వెళ్ళి యుండినపు డా గ్రామము కాలిపోఁగా నందు వత్స, రాజు భార్య యగువాసవదత్తయు, మంత్రి యౌగంధరాయణుఁడును మరణించి రనియుఁ దెలుపును. అచ్చట నున్నవా రందఱును నావృత్తాంతమును విని సానుభూతిఁ బ్రకటింతురు. అంత బ్రహ్మచారి వాసవదత్తకొఱకై వత్సరాజు విలపించినవిధమును మిక్కిలి దయనీయముగ వర్ణించి చెప్పి రుమణ్వంతుఁ డనుమంత్రి యాతని నూఱడించుటకు సర్వవిధములఁ బ్రయత్నించుచుండె నని తెలుపును. బ్రహ్మచారి తెలిపిన యీ కథను వినుచున్న వారిలో ముగ్గురకు మూఁడువిధము లైనయనుభూతులు గలిగెను. యౌగంధరాయణుఁడు తన సంకల్పము కార్యరూపము దాల్చి ఫలోన్ముఖ మగుచుండె నని తృప్తిపడెను. వాసవదత్త లోలోన దుఃఖించినను, వత్సరాజు తనయెడ గాఢానురక్తుఁ డగుటను బ్రహ్మచారిమూలమున విని మిక్కిలి సంతోషించును. పద్మావతియు వత్సరాజు గుణగణములను విని ముగ్ధురా లగును. అతనియెడ నామెకుఁ బ్రేమాదరము లప్పుడే మొలకెత్త సాఁగెను. వాసవదత్త యగ్నిదగ్ధయై నిజముగనే మరణించిన దని పద్మావతి తలఁచును. అట్టి విశ్వాసమా మెకుఁ గలుగనిచో నుదయనునిఁ జేపట్టుట కామె యంగీకరింపఁజాలదు. యౌగంధరాయణుఁడు తన ప్రజ్ఞచే నాటిన యీ కథాబీజము క్రమముగాఁ దరవాతి యంకములలోఁ బ్రోదిగాంచుటను మనము చూడఁగలము.

తరువాత బ్రహ్మచారియు, యౌగంధరాయణుఁడును నా తపోవనమునుండి నిష్క్రమింతురు. పద్మావతి తాను న్యాసముగ స్వీకరించిన వాసవదత్తతోఁ గూడ నంతఃపురమునకుఁ బోవును.

విమర్శము :

కథానిర్మాణదృష్టితోఁ జూచినప్పు డీప్రథమాంక మీనాటకమునందు మిక్కిలి ప్రాధాన్యము కలిగి యున్నది. యౌగంధరాయణుని ప్రయత్నము యొక్క విజయము గాని, పరాజయము గాని మగధరాజగుదర్శకుని సైనిక సహాయముఁ బొందుటపై నాధారపడి యున్న దనుటలో సందేహము లేదు..

ఈ ప్రథమాంకమున యౌగంధరాయణునికిఁ దన ప్రయత్నము ఫలోన్ముఖము కాఁగల దనువిశ్వాస మేర్పడుటయు అదృష్టవశమున వాసవదత్తయు నాతనికి సంపూర్ణముగఁ దన సహాకారము నొసఁగుటయు. వాసవదత్తయు యౌగంధరాయణుఁడును మరణించి రనువిషయము నాతఁడు లోకమున వ్యాపింపఁ జేయుటలోఁ గృతార్థుఁ డయ్యెను. తుదకు లావాణకమున నుదయనుఁడును, మగధలోఁ బద్మావతియుఁ గూడ నా వృత్తాంతమును విశ్వసింతురు. బ్రహ్మచారి యితరుల కెట్టి సందేహమును గలుగకుండఁ దన పాత్రమునుఁ జక్కఁగ నిర్వహించెను. పద్మావతియు నుదయనుని గుణగణములను విని యాతనిఁ బ్రేమించుటకుఁ బ్రారంభించును. ఏ వివాహమువలన నుదయనునికి దర్శకునివలని సహాయము లభించునో, యా వివాహము జరుగుట కిట బీజము నాటఁబడినది. వాసవదత్తయుఁ బద్మావతికడ న్యాసముగ నుంపఁబడుటచే వారిరువురును బరస్పరము ప్రేమాదరములు గలిగి వర్తించుట కవకాశము కల్పింపఁబడినది. ఇట్లు తన పన్నాగమునకు దిట్టమైన పునాదులు నిర్మించినయౌగంధరాయణుఁడు "అబ్బ! సగము బరువు తీరినది" యని నిశ్వసించుటలో న్యాయము లేకపోలేదు.

మఱియు నీ ప్రథమాంకము యౌగంధరాయణుఁడు, వాసవదత్త, పద్మావతి యనువారిలోని గుణవిశేషములను జక్కఁగాఁ జిత్రించుచున్నది. ఈ ప్రథమాంకమునకు సంబంధించినంతవఱకు యౌగంధరాయణుఁడే ప్రధానపాత్రము. అతని దృఢసంకల్పము, కార్యదీక్ష, స్వామిభక్తిపరాయణత్వము మొదలగుగుణము లిందుఁ జక్కఁగాఁ బరిపోషింపఁబడినవి. వాసవదత్త ముగ్ధమధురహృదయ. తన భర్తయెడ గాఢానురాగము గలశీలవతి. తన సౌఖ్యత్యాగముచేత నయినను భర్తృశ్రేయమును సాధింపఁ బూనుటలో నామెశీల మిందుఁ బరమావధిఁ జెందుచున్నది. కాని యప్పుడప్పు డామె విచారమునకు లోనై కుందుచుండుట యామెలో నిగూఢమయి యున్న స్త్రీస్వభావమును దెల్లము సేయుచున్నది. వాసవదత్త

హృదయమునందుఁ జెలరేగిన భావపరంపర లిందుఁ జక్కఁగఁ జిత్రింపఁబడినవి. ఒకవంక నామె హృదయము తన సౌఖ్యత్యాగముచేత నయినను భర్త శ్రేయస్సు కొఱకై పాటుపడ వలయు నని మ్రొగ్గు చూపును. మఱొకవంక తనభర్త యన్యాక్రాంతుఁ డగుచుండె ననియు, నాతని ప్రేమమును మఱొక కాంత తనతో సమానముగఁ బంచుకొనఁ బోవుచున్న దనియు నెఱిఁగి స్త్రీ సహజ మైన యసూయను వహించును. వాసవదత్తలోని యీ మానసిక భావచిత్రణము తరువాతి యంకములలో మఱింత స్పష్టముగ మనకు గోచరించుచున్నది.

పద్మావతి కోమలహృదయగాను, నతిథిపూజాపరాయణగాను, యుక్తాయుక్తముల నెఱిఁగిన విజ్ఞురాలుగాను, మన కీ యంకమున సాక్షాత్కరించుచున్నది. ఉదయనుఁ డీ యంకమునఁ బ్రత్యక్షముగాఁ గానరాక పోయి నప్పటికిని నాతని మహోన్నతశీలమును, వాసవదత్తయెడ నాతనికిఁ గల గాఢానురాగమును నిందుఁ జక్కఁగాఁ జిత్రింపఁబడినవి. కాంచుకీయుండు, తాపసి, దాది, మొదలగు చిల్లరపాత్రములు కూడ నిందుఁ జక్కఁగాఁ బరిపోషింపఁబడినవి. బ్రహ్మచారి గావించిన తపోవనవర్ణనమును, నంకాంతమునఁ గావింపఁబడిన సూర్యాస్తమయ వర్ణనమును మిక్కిలి హృదయంగమములుగ నున్నవి. భాసమహాకవి ప్రకృతివర్ణనాసామర్థ్యమున కివి రెండును రెండు చక్కనిదృష్టాంతములు!

## ద్వితీయాంకము

ద్వితీయాంకప్రారంభమున నున్న ప్రవేశకమును బట్టి పద్మావతి మాధవీలతామండపము దగ్గఱ గందుకక్రీడ సలుపుచుండె నని మనకుఁ దెలియవచ్చుచున్నది. పిదప నామె వాసవదత్తతోను, చేటితోను గందుకక్రీడ సల్పుచుఁ బ్రవేశించును. ముగ్గురును సంతోషముగఁ గందుకక్రీడ సల్పుచుందురు. అప్పుడు వాసవదత్త పద్మావతిహృదయ మెఱుఁగఁ గోరి మహాసేనుఁడు తన కుమారునికై పద్మావతి నడుగఁ బంపినవృత్తాంతమును బ్రస్తావించును. అప్పుడు చేటి పద్మావతి మహాసేనునితోడి బంధు

త్వము నొల్లకున్న దనియు, నామె హృదయము వత్సరాజుపై లగ్నమై యున్న దనియుఁ దెలుపును. వాసవదత్త యది విని మిక్కిలి సంతోషించును. కాని యంతలో నూరకుండక వాసవదత్త పద్మావతిని నామె యుదయనుని ప్రేమించుటకుఁగల కారణమును గూర్చి గ్రుచ్చి గ్రుచ్చి యడుగును. అప్పుడు చేటి వత్సరాజు దయాహృదయుఁ డగుటచే రాజకుమారి యాతనిఁ బ్రేమించుచుండె నని తెలుపును. మఱియు నాచేటి యా రాజందముగా నున్నాఁడో లేఁదో యని సందేహము వెలిబుచ్చఁగా వాసవదత్త నోట న ప్రయత్నముగ నాతఁడు మిక్కిలి యందముగా నుండు ననుమాటలు వెలువడును. వెంటనే పద్మావతి వాసవదత్తకా విషయ మెట్లు తెలిసిన దని ప్రశ్నింపఁగా వాసవదత్త 'యుజ్జయినిలోని జను లట్లు చెప్పుకొందు' రని చెప్పి తెలివిగా నాచిక్కునుండి తప్పించుకొనెను.

ఇంతలోఁ బద్మావతిదాది వచ్చి యామె దర్శకునిచే వత్సరాజున కొసఁగఁబడె ననుసంతోషవార్త వినిపించును. స్త్రీ సహజ మైనయసూయచే వాసవదత్త యప్రయత్నముగ 'దారుణము! దారుణము!' అనును. అంత నా మాటలకు సమాధానముగ 'వాసవదత్తకొఱకై యట్లుగా విల పించినవత్సరాజామెను విస్మరించుట దారుణ' మని తాను భావించినట్లు తెలుపును. మఱియు నామెలోని స్త్రీత్వము 'వత్సరాజామెను స్వయముగానే వరించెనా !' యని ప్రశ్నింపఁ జేయును. ఏదో పనిమీఁద మగధకు వచ్చియుండినయుదయనునకు దర్శకుఁడే తన సోదరి నిచ్చె నని తెలిసికొని యామె యూఱట నెందును.

ఇంతలో మఱొక చేటి వచ్చి వివాహముహూర్త మాసన్న మైన దని తెలుపును. వాసవదత్త తానే స్వయముగఁ బద్మావతీవత్సరాజుల వివాహమునకు సంకల్పించి తన్నిర్వహణమునకై యెదురుచూచు చున్నను నా వివాహము త్వరలో జరుగ నున్న దని యెఱిఁగి నంతనే యామెహృదయము స్త్రీసహజ మైనబలహీనతకుఁ దావల మై క్షోభ నెందును.

విమర్శము :

ఈ ద్వితీయాంకములోని సంఘటనములను జూచినప్పు డవి యన్నియుఁ బ్రథమాంకములోని విషయముల క్రమపరిణామము లని తోఁపక మానవు. యౌగంధరాయణుని సాహసప్రయత్నమునకు శిఖరభూత మగు పద్మావతీవత్సరాజుల వివాహ మీ యంకమున స్థిరపడును.

మఱియు వాసవదత్త పొందినమానసికక్షోభ యంతయు నీయంకమున మిక్కిలి రమణీయముగఁ జిత్రింపఁబడినది. మొదట నామెయే పద్మావతీవత్సరాజుల వివాహమునకు సమ్మతించి తత్సాధనమునకై కార్యోన్ముఖురాలైనను వత్సరాజు పద్మావతిని వివాహ మాడుచున్నాఁడని యెఱిఁగినంతనే యామె దుఃఖపరవశయై తన భర్తృప్రేమమును బద్మావతితోఁ గూడి పంచుకొనుటకంటెఁ దనకు గత్యంతరము లేదని యూఱడిల్లును. ఇందు నాటకకర్త స్త్రీస్వభావమును మిక్కిలి నిశితముగఁ జిత్రించియున్నాఁడు. ఈ యంకమం దంతటను వాసవదత్త - యొకవంక యౌగంధరాయణుని సహచరిగాను, మఱొకవంక నుదయనుని ప్రేమమును జూఱగొన్న ప్రేయసిగాను బాత్రద్వయముగ మనకుఁ బ్రతిభాసించును. అప్రయత్నముగఁ దన నోట వెలువడినమాటలవలనఁ దమ రహస్యమునకెట్టి భంగము కలుగ నీయకుండఁ దప్పించుకొనుటలో నామె ప్రదర్శించినబుద్ధినైశిత్య మిందుఁ జక్కఁగాఁ బ్రదర్శిత మయినది. పద్మావతి సునిశితబుద్ధియు నిందుఁ జక్కఁగఁ జిత్రింపఁబడినది. వారిరువుర హృదయములందును బరస్పరప్రేమాదరములు పెంపొందుట కీయంకము మిక్కిలి చక్కఁగా నుపకరించినది.

## తృతీయాంకము

పద్మావతీవత్సరాజుల వివాహము మిక్కిలి వైభవముతో జరగుచుండెను. వాసవదత్త వివాహమున నుత్సాహముతోఁ బాలుగొన లేకయు వ్యక్తముగఁ దనహృదయముఁ దెలుపఁజాలకయు వైవాహికమండపము

నుండి యెవ్వరికిఁ దెలియకుండునట్లుగ వెలికి వచ్చి యుద్యానవనమున నొంటరిపాటున నుండి చింతించుచుండును. ఆమె తన దురదృష్టమునుగూర్చి తలపోయుచుఁ దన కట్టిదుస్థితిని జేకూర్చినదేవతలను నిందించుచుఁ గూర్చుండి యుండఁగా నచ్చటి కొక చేటి వచ్చి పద్మావతికిఁ గౌతుకమాలను గూర్పవలసిన దని కోరును. వాసవదత్త యా కార్యముఁ గూడఁ దన హస్తములతోఁ దానే స్వయముగఁ జేయవలసి వచ్చినందులకు మిక్కిలిగ దుఃఖించును. కాని తన హృదయము వత్సరాజునుగూర్చి యాకృష్టము కాఁగా 'నల్లుడుగా రందముగా నున్నారా' యని యామె చేటిని బ్రశ్నించును. ఆ చేటియు వత్సరాజు సౌందర్యమును, గుణగణములను నభివర్ణింపఁ దొడఁగఁగా వాసవదత్త యామాటల నాపి కౌతుకమాల నిచ్చి చేటిని బంపివైచును. పిదప నామె సెజ్జపైఁ బరుండి యైనను హృదయభారము నొంత యుపశమింపఁ జేసికొనఁ దలఁచి నిదురింపఁ బోవును.

విమర్శము :

ఈ యంకమునందు యౌగంధరాయణుఁడు సంకల్పించిన పద్మావతీవత్సరాజుల వివాహము నిర్వర్తింపఁబడుచున్నట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. కథాసరిత్సాగరమునందలి యుదయనవృత్తాంతమున వాసవదత్త కూర్చినకౌతుకమాల కథలోఁ బ్రధానస్థానము నాక్రమించుచున్నది. ఎన్నఁడును వాడిపోవని యట్టిమాలను గూర్చుట కొక్క వాసవదత్తకే తెలిసియుండుటవలన వాసవదత్త సజీవ యై యుండు నని దానిఁబట్టి వత్సరాజూహింపఁ గలుగును. కాని యీ నాటకమునందలి కౌతుకమాలావృత్తాంతమునకుఁ గథలో నట్టిప్రాధాన్యమును లేదు. మఱియు నీయంకము సంస్కృతనాటకప్రపంచమునందుఁ బేర్కొనఁదగినకరుణదృశ్యములలో నొకటి యని చెప్పుట కెట్టి సందేహమును లేదు. ఏ వివాహముకొఱకై వాసవదత్త సంకల్పించి కార్యరంగమునఁ గృషి సల్పుచుండెనో, యా పద్మావతీవత్సరాజుల వివాహము మహావైభవముతో జరుగుచుండెను. పాపము! దురదృష్టవంతురా

అగువాసవదత్త యీ వైభవములోఁ బాలుగొనుట కళకస్తురా అగుట యిందు మనోహరముగఁ జిత్రింపఁబడినది. 'ఆర్యపుత్రుఁడు కూడఁ బరకీయుఁ డగుచున్నాఁ' డనుమాట లప్రయత్నముగ నామెనోటనుండి వెలువడును. కాని పెండ్లికూఁతు రగుపద్మావతికిఁ గూర్పునెచ్చెలిగా నుండినవాసవదత్తయా సంతోషసమయమున విషణ్ణహృదయ యై యుండుటకు వీలు లేదు. ఇట్లు వాసవదత్త మనస్సున రెండువిభిన్నభావముల సంఘర్షణ మేర్పడుట కారణముగా నామె తన మనస్సులోనే యాబాధ ననుభవింపవలసి వచ్చెను.

## చతుర్థాంకము

ఈ యంకము వత్సరాజువిదూషకుఁ డగువసంతకుని యాత్మగత భాషణముతోఁ బ్రారంభ మగును. అతని పలుకులనుబట్టి పద్మావతీవత్స రాజుల వివాహము మిక్కిలి వైభవముతో జరగిన దనియుఁ, దత్కారణమున నాతని కజీర్ణరోగము వచ్చిన దనియుఁ దెలియుచున్నది. ఇంతలో నొకచేటి వచ్చి వత్సరాజు స్నాన మైనదో లేదో చూడు మని యాతనిఁ గోరుటచే నాతఁడు వత్సరాజుకడకుఁ బోవును. పిదపఁ బద్మావతియుఁ, జేటియు, వాసవదత్తయు నుద్యానవనమును బ్రవేశింతురు. అందు వారు శేఫాలికాకుసుమములు వికసించినవో లేవో యని చూచుచుందురు. అప్పుడు పద్మావతి వత్సరా జాయుద్యానవనమునకు వచ్చునేమో యని యందలి పుష్పములఁ గోయవల దని చేటిని వారించును. వాసవదత్త యా సందర్భమును బురస్కరించుకొని తనభర్త పద్మావతి నెంతగాఁ బ్రేమించుచుండెనో యెఱుఁగఁగోరి "చెలీ! నీభర్తను నీ వంతగాఁ బ్రేమించుచుంటివా?" యని ప్రశ్నించును. పద్మావతియు "ఏమో నాకుఁ దెలియదు. అతఁడు లేనప్పుడు నే నొకలాగున నగుచున్నా" నని యుచిత విధమున సమాధానముఁ జెప్పును. ఈసమాధానము విని వాసవదత్త విషణ్ణహృదయ యగును. అప్పుడు పద్మావతి "వాసవదత్త కూడ నార్యపుత్రుని నిట్లే ప్రేమించుచుండెనా?" యని ప్రశ్నించును. అపుడు వాసవదత్త 'యింత

కంటె నధికముగనే యామె వత్సరాజును బ్రేమించుచుండె' నని చెప్పును. అప్పుడు పద్మావతి 'అది నీ కెట్లు తెలియును' నని యడుగఁగా వాసవదత్త తాను నోరు జాఱినందులకుఁ జింతించి తెలివిగా 'నామె స్వజనమును గూడ విడనాడి వత్సరాజు వెంట వచ్చుటచే నట్లు తలఁచితి' నని మెలఁకువతో సమాధాన మిచ్చి తప్పించుకొనును.

అంతఁ జేటి పద్మావతితో "అమ్మా! వత్సరాజును నీకు వీణ నేర్పు మని యడుగుము" అనెను. అందులకుఁ బద్మావతి తా నట్లడిగితి ననియు, వత్సరా జేమియుఁ బలుకక నిట్టూర్చె ననియుఁ జెప్పును. అంత వాసవదత్త తన్ను వత్సరా జెంకనుఁ బ్రేమించుచుండె ననువిషయ మెఱుఁగఁగోరి "దానిఁ బట్టి నీ వేమి యనుకొంటివి?" యని ప్రశ్నించును. పద్మావతియు నార్య వాసవదత్తగుణములను స్మరించి తనభర్త బదులు పలుకకుండె ననియుఁ, దనసమక్షమునఁ బెల్లుబికి వచ్చుచుండినకన్నీళ్ళ నెట్లో యాపుకొనె ననియుఁ దెలుపును. ఈపలుకులు విని వాసవదత్త మిక్కిలి సంతోషించును.

ఆసమయమున వత్సరాజు తనపూర్వవృత్తాంతమును స్మరించుచు నాయుద్యానవనముఁ బ్రవేశించును. వసంతకుఁడును, దనరాజు విచారమును బోఁగొట్టుటకై యెన్నోవిధములఁ బ్రయత్నించును. అప్పుడే యాకసమునఁ బోవుచుండిన బెగ్గురుపక్షులబారును జూపి వసంతకుఁ డాతనికిఁ గొంత యూఱటఁ గూర్చును. వత్సరాజును, వసంతకుఁడును నాయుద్యానవనము లోనికిఁ బ్రవేశించుటఁ జూచి వాసవదత్త మొదలగువారు మాధవీలతా మండపములోనికిఁ బోవుదురు.

వత్సరాజును, వసంతకుఁడును దనకు సమీపముననే యుండి సంభాషించుకొనుటను జూచి వాసవదత్తహృదయ ముద్వేగము పొందసాఁగెను. వత్సరాజు తనయెడఁ బాటుచే దుఃఖ మందుటను జూచి వాసవదత్త కన్నీరు నించును. అది చూచి చేటి 'వాసవదత్త యేడ్చుచున్నది' యని పలుకఁగాఁ బద్మావతి రెల్లుపూలపుప్పొడి పడుటచే నట్లయి యుండు నని చెప్పెను.

అంత విదూషకుఁడు వత్సరాజును, మాధవీలతామండపమున దాఁగి యుండినవాసవదత్తాదులను నొకపెద్దచిక్కులోఁ బడవేయును. "నీకు మిక్కిలి యిష్టురాలెవతె? మునుపటి యార్యవాసవదత్తయా? ఇప్పటి పద్మావతియా' యని యాతఁడు వత్సరాజును బ్రశ్నించును. అది విని పద్మావతియు, వాసవదత్తయు వత్సరాజేమి సమాధానముఁ జెప్పునో యని కలఁతఁ జెందుదురు. పద్మావతి మాత్రము వసంతకుఁ డావిషయమై వత్సరాజు నొత్తిడి చేయకుండిన బాగుండు నని తలఁచెను. వాసవదత్త వత్సరాజేమి సమాధానముఁ జెప్పునో యని వినఁగోరును. వత్సరాజు వెంటనే సమాధానము చెప్పుటకు వెనుదీయుచుండుటఁ జూచి పద్మావతి యాతని హృదయ మింకను వాసవదత్తయందే లగ్నమై యుండె నని యూహింపఁ గలుగును. "అందచందములందును, శీలమందును బద్మావతి తనకుఁ గూర్చు ప్రియురాలే యైనను వాసవదత్తయందె తనహృదయము నామె మరల్పఁ జాలకుండె" నని వత్సరాజు చెప్పును. ఆపలుకులు వినుటచే వాసవదత్త హృదయభారము తగ్గును. చేటి మాత్రము వత్సరాజన్యాయముగఁ బ్రవర్తించె నని పలుక నుదారహృదయ యగు పద్మావతి మాత్ర మెన్నఁడో చనిపోయినవాసవదత్తను స్మరించుచున్నందులకు వత్సరాజును బ్రశంసించును. వాసవదత్త చాలకాలముక్రిందనే చనిపోయిన దని దృఢముగ విశ్వసించిన దగుటచేఁ బద్మావతి వాసవదత్తవిషయమై యెట్టి యసూయాద్వేషములను బ్రకటింపలేదు. పద్మావతి వాసవదత్తనుగూర్చి పలికినపలుకు విని వాసవదత్తయు నామెయెడ గొప్పగౌరవభావము పూనును.

అంత వత్సరాజును 'నీ కిష్టురాలెవతె? మునుపటియార్య వాసవదత్తయా? ఇప్పటి పద్మావతియా' యని వసంతకునిఁ బ్రశ్నించును. వసంతకుఁడేదో సమాధానముఁ జెప్పును. అప్పుడు రాజు కుపితుఁడై యేదో జ్ఞాపకముతో 'నీవిషయ మంతయు వాసవదత్తకుఁ జెప్పెదను లెమ్ము' అని పలుకును. అప్పుడు వసంతకుఁడు 'వాసవదత్త చాలకాలము క్రిందటనే

చనిపోయినది గదా!' యని యావిషయము నాతనికి జ్ఞప్తికిఁ దెచ్చును. వత్సరాజు తిరిగి దుఃఖపరవశుఁ డగును.

పద్మావతి తనభర్తకు మనశ్శాంతిఁ జేకూర్పఁ దలఁచి యచ్చటినుండి తనచెలులతో మరలిపోవఁ జూచును. కాని వాసవదత్త దుఃఖితుఁ డైన రాజును వదలిపెట్టి పోవుట ధర్మము గాదని పలికి యాతని దగ్గఱకుఁ బోయి సేద దేర్పు మని పద్మావతి నుద్బోధించును. పద్మావతియు వత్సరాజుకడకుఁ బోవును. అప్పుడు వసంతకుఁడు రెల్లుపూలపుప్పొడి పడుటచే వత్సరాజుముఖము కన్నీటిచేఁ దడిసి యుండె నని తెలిపి రాజును గాపాడెను. పద్మావతి యావిషయమును విశ్వసించి నట్లుగానే నటించి వత్సరాజు ముఖము కడుగుకొనుటకొఱకై తామరాకు దొప్పలో నీటిని గొంపోవును. నవోద్వాహ యైనపద్మావతి కావిషయము తెలిసిన నామె చింతించు నేమో యని వత్సరాజాందోళన మందును. ఇంతలో వసంతకుఁడు రాజాస్థానమందు దర్శకుఁడు తమకొఱకై యెదురు చూచు చుండు ననియుఁ, దాము వెంటనే యచ్చటికిఁ బోవలయు ననియుఁ జెప్పి వత్సరాజు నాదుస్థితినుండి తప్పించును.

విమర్శము :

ఇది యీ నాటకమందలి యంకములలో నెల్ల మిక్కిలి పెద్దది. కాని యీయంక మేవిధముగాను గథాగమనమునకుఁ దోడ్పడుట లేదు. కాని యిందు మానసికభావసంఘర్షణము మిక్కిలి నిపుణముగఁ బ్రదర్శింపఁబడి నది. ఇందు ముగ్గురు వ్యక్తు లొకచోటనే యున్నను జాలదూరమున నున్నవారివలెఁ బవర్తింతురు. అందగత్తె, కూర్చునది, మెత్తనిహృదయము గలది యగుపద్మావతిని వివాహమాడి వత్సరాజు వాసవదత్తావిరహమువలని తనదుఃఖమును బోఁగొట్టుకొనఁ దలఁచును. కాని యాతఁడు వాసవదత్త యందు లగ్నమైనతనహృదయమును మరల్పఁజాల కుండెను. ఆమెను స్మరించినంతనే యాతనిహృదయము మఱింతగా వ్యథ చెందును. నాత

నోద్వాహ యైనపద్మావతి కాతఁడు తనహృదయమును బ్రకటింపఁడు. ఆమె యే మనుకొనునో యని యాతని భయము. అందుచే నాతఁడు తనవిచారము నంతను తనమనస్సులోనే యడఁచుకొనవలసి వచ్చెను. తన మిత్రుఁ డగువసంతకునితో నయినను నేకాంతమున నున్నప్పుడు మాత్రమే యాతఁడు తనహృదయమునందలి సంతాపమును బ్రకటించు చుండెను.

వత్సరాజు వాసవదత్తకొఱకై చింతించుచుండఁగా నా దురదృష్ట వంతురా లతనికడకుఁ బోయి యాతనిహృదయభారముఁ దగ్గింపఁ గోరియు నట్లు చేయఁజాలకుండెను. వత్సరాజైనను వసంతకునితోఁ దనదుఃఖమును జెప్పికొనుట కవకాశ మున్నది. వాసవదత్త కది కూడ లేదు. ఆమె తనపుట్టెడుదుఃఖమును దనలోనే యడఁచుకొనవలసినదుస్థితి యేర్పడెను. తన భర్త తన కతిసమీపములోనే యుండి దుఃఖించుచుండఁగా నేమియుఁ జేయఁజాలనినిస్సహాయస్థితిలో వాసవదత్త పడిన మానసికసంక్షోభమును వర్ణింపఁ దరము గాదు. అంతటి దుస్థితిలోను నామె తనహృదయమును బ్రకటింపక యౌగంధరాయణుని ప్రయత్నముపట్ల హెచ్చరిక గలిగి ప్రవర్తించుటనుబట్టి యామెకర్తవ్యశ్రద్ధ మనకు వ్యక్తము కాఁగలదు. ఒకవంకఁ బెల్లుగ సంతాపము పొందుచున్నను వాసవదత్త తనభర్తకుఁ దనపైఁ గల గాఢానురాగ మెఱిఁగి ముద మందును. ఆశ్చర్య మేమనఁగా నామె మోద మందను, మోద మందను వత్సరాజు దుఃఖము కట్టలు లేనిప్రవాహమై త్రెంచుకొని పోవును. నాయికానాయకు లొక్కచోటనే యుండి విప్రలంభశృంగారము ననుభవించిన యిట్టికరుణరసఘట్టము సంస్కృతనాటక ప్రపంచమునందే మనకుఁ గానరాదు.

అగ్నిగోళములు మండుచుండిన వాసవదత్తావత్సరాజుల హృదయము లందే పద్మావతియొక్క మధురమూర్తి కూడ మనకు దర్శన మొసఁగుచున్నది. ఆమె వత్సరాజును గాఢముగాఁ బ్రేమించిన దయినప్పటికిని నామె తన భర్త వాసవదత్తయెడఁ గలిగియుండినగాఢానురాగమును బ్రశంసింపఁ గలుగుటలో నామెయౌదార్యమును,విశాలహృదయమును మనకు వ్యక్తము

అగుచున్నవి. వాసవదత్తయందు లగ్నమైనహృదయము నామెనుండి మరల్పఁజాలకున్నా నని రాజు వచించినప్పుడును బద్మావతి తన మనస్సున నెట్టి కష్టమును బొందకుండుటలో నామె విశాలహృదయము పరమావధిఁ జెందుచున్నది. పద్మావతియెడ వత్సరా జన్యాయముగఁ బ్రవర్తించె నని చేటి చెప్పినను బద్మావతి యందు వత్సరాజు చేసినయన్యాయ మేదియు లే దని చెప్పును. ఆయౌదార్యము వాసవదత్తను ముగ్ధురాలినిగాఁ జేయును. వాసవదత్త యామెను మఱింతగాఁ బ్రేమించును. రా జతిమాత్రముగ దుఃఖ మందుటఁ జూచి పద్మావతి యాతనికి ముదముఁ గూర్పఁ దలఁచును గాని యందుకై యామె కేమి చేయుటకును దోఁపలేదు. తనమూలమునఁ దనభర్త కట్టిబాధయుఁ గలుగరా దని యామెహృదయము గోరుచుండెను. ఇట్టిమానసికసంక్షోభముచేతనే యామెకుఁ దలనొప్పి వచ్చిన దనువిషయము మనకుఁ దరువాతి యంకమునఁ దెలియవచ్చుచున్నది.

సాధారణముగ సంస్కృతనాటకములలోఁ గానవచ్చువిదూషకపాత్రములకును నీనాటకములోని వసంతకునిపాత్రమునకును జాల భేదము గలదు. ఇం దీతఁడు కథలోని ముఖ్యపాత్రములలో నొకఁడై వత్సరాజు విషాదమును బోఁగొట్టుచు నాతనికి విశ్రమస్థానభూతుఁడుగ నుండును.

## పంచమాంకము

ఈయంకప్రారంభమున నున్నప్రవేశకమునుబట్టి పద్మావతి తలనొప్పితో బాధపడుచున్న దని మనకుఁ దెలియుచున్నది. ఆమె చెలికత్తెలలో నొకతె వాసవదత్తకావిషయమును దెలుపుటకుఁ బోవును. మఱొకతె వత్సరాజున కావిషయమును దెల్పుటకై వసంతకునిఁ గోరఁ బోవును.

అంత వత్సరాజు విషణ్ణహృదయుఁడై ప్రవేశించును. పద్మావతిని వివాహ మాడినపిదపఁ గూడ నాతనిహృదయము వాసవదత్తవైపునకే యాకర్షింపఁబడుచుండెను. ఇంతలో వసంతకుఁడు వచ్చి పద్మావతికిఁ దలనొప్పిగా నున్న దని తెలుపును. ఆతఁడును వెంటనే సముద్రగృహ

మున నున్న యామెను గలిసికొనుటకొఱకై వడివడిగాఁ బోవును. రాజును సంతోషపెట్టఁ దలఁచి వసంతకుఁడు నేలపైఁ బడియుండిన పుష్పహారమును సర్ప మనుకొని భయపడినట్లు నటించును. వారు సముద్రగృహమును ప్రవేశింతురు. పద్మావతి యచ్చటి కింకను రాకుండుటచే నామె జబ్బు కొంత నయముగ నున్న దలఁచి వత్సరా జచ్చట నామెకై సిద్ధపఱుపఁబడిన సెజ్జపైఁ బరుండి నిదురించును. వసంతకుఁడు మిక్కిలి చలిగా నుండుటచే దుప్పటిఁ దెచ్చుకొందు నని యంతఃపురమునకుఁ బోవును.

అంత వాసవదత్త సముద్రగృహమును బ్రవేశించును. పద్మావతి జబ్బుగా నున్న దనువిషయము విని వాసవదత్త మిక్కిలి కలఁత నొందెను. తన భర్తకు దుఃఖోపశమనము గలిగించుచుండిన పద్మావతి కూడ జబ్బుపడుట యామెకు విచారహేతు వయ్యెను. ఆమె యుద్వేగముతోఁ బడకదగ్గఱకు బోయి దానిపై ముసుఁగు తన్ని నిదురించుచుండిన వత్సరాజును బద్మావతి యనుకొని యాతని ప్రక్కగాఁ గూర్చుండును. జబ్బుగా నున్న పద్మావతిని జెలికత్తె లట్లు వదలిపెట్టి వెళ్ళిపోయినందుల కామె యాశ్చర్యము ప్రకటించెను. పద్మావతి తలనొప్పి తగ్గి గాఢముగా నిదురించుచుండె నని భావించి వాసవదత్త యామె ప్రక్కనే పరుండఁ బోవును. ఇంతలో "హా ప్రియా! వాసవదత్తా!" యని వత్సరాజు కలవరించును. అది విని వాసవదత్త యా పడకపై వత్సరాజు నిదురించుచుండె నని యెఱిఁగి యాతఁడు తన్ను గుర్తించుట సంభవించినచో యౌగంధరాయణుని ప్రయత్న మంతయు వ్యర్థ మగు నని యామె భయ మంద సాఁగెను. కాని యదృష్టవశమున వత్సరాజు నిదురయందే కలవరించుచుండెను. ఆమె యచ్చటనే కొంతసే పుండి తనభర్తను గన్నులారఁ జూడ నెంచును. రాజును దనతప్పిదమును క్షమింపవలసిన దని వాసవదత్తను వేఁడుచుఁ జేతులు చాచును. ఆమెయా మంచముమీఁదినుండి క్రిందికి వ్రేలాడుచుండిన యాతని చేతిని మెల్లగఁ బడకమీఁదికిఁ జేర్చి యా ప్రదేశమునుండి వెడలిపోవును.

వాసవదత్త హస్తస్పర్శముచే వత్సరాజు మేల్కొని వాసవదత్త వెడలిపోవుచుండుటను జూచి యామెను బట్టుకొనుటకొఱకై ముందునకుఁ బోవును. అప్పు డావేగములో నతనితలకు ద్వారబంధము తగిలి యాతఁడు నేలమీఁదఁ బడిపోవును. ఇంతలో నచ్చటికి వసంతకుఁడు రాఁగా వాసవదత్త జీవించియే యున్న దని వత్సరాజు పలుకును. కాని వసంతకుఁడు డామె చిరకాలముక్రిందనే చనిపోయిన దనియు, నతఁడు స్వప్నమున నామెను గాంచి యుండు ననియుఁ బలుకును. 'అది స్వప్నమె యయ్యె డుచో నిదురయె తా ధన్య మగు ననిందితలీలన్' అని వత్సరాజు పలుకును.

ఆ సమయమున దర్శకుని కాంచుకీయుఁ డొకఁడు వచ్చి వత్సమగధ దేశసైన్యములు కలిసి యారుణిని జయించుటకై యిప్పుడే గంగానదిని దాటిపోవుచుండె ననువిషయముఁ దెలుపును. రాజును దనవిచారము నంతను మఱచిపోయి తన యాసనముమీఁదినుండి లేచి యారుణిని యుద్ధరంగమునఁ జీల్చి చెండాడుదు నని ప్రతిజ్ఞఁ జేయును.

విమర్శము :

ఈ యంకమునందలి వత్సరాజు స్వప్నసన్నివేశమునుబట్టియే యీ నాటకమునకు స్వప్నవాసవదత్త మని పేరు గలిగినది. ప్రాచీనాలంకారికులును, నేఁటి విమర్శకులును నీయంకమును విశేషముగాఁ బ్రశంసించి యున్నారు. సంస్కృతనాటకకర్తలు కొంద ఱీసన్నివేశములవంటి సన్నివేశములను కల్పించి యీతని ననుసరించిరి. భాసుఁ డీసన్నివేశమునకు సహజరామణీయకము సిద్ధింపఁజేయుటయందు గొప్పప్రతిభను బ్రదర్శించెను. పద్మావతి జబ్బుగా నున్న దని విని వాసవదత్త సవిషాదముగ సముద్రగృహమును బ్రవేశించును. తనకు నెచ్చెలి యైనపద్మావతి కనారోగ్యముగా నున్న దని మాత్రమే కాక వత్సరాజున కేకైకవినోద హేతువుగ నుండినయామె యస్వస్థురాలుగ నుండుట యామెకు విచారము

గలిగించెను. ఆమె సముద్రగృహమును బ్రవేశించినప్పు డాప్రదేశము చీఁకటిగా నుండెను. అచ్చట జనులు కూడ నెవ్వరును లేరు. అట్టి చీఁకటిలో నట్టిమానసికస్థితిలో సెజ్జపైఁ బరుండియుండినవత్సరాజును బద్మావతి యేమో యని యామె భ్రమించుటలోఁ దప్పు లేదు. పద్మావతి జబ్బునయ మగుటచే నామె గాఢముగ నిదురించుచుండె నని యామె తలఁచెను. తక్కినచెలులవలె నామెను విడిచి పోవఁ జాలక వాసవదత్తయాపడకపై నామె ప్రక్కనే తాను బరుండఁదలచును. ఇచ్చట వాసవదత్త తనకే తెలియక పద్మావతి యని భావించి వత్సరాజు నెడఁ జూపుచున్న ప్రేమము క్రమపరిణతి మిక్కిలి చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినది. నిదురలో నతఁడు "హా ప్రియా! వాసవదత్తా!" యని కలవరించినప్పుడే యామె తనతప్పునుగుర్తింపఁ గలుగును. వారికిర్వురికిని జరగినసంభాషణము వాసవదత్తను గుర్తించి రాజు మేలుకొనియే మాటలాడునట్లు మనకుఁ దోఁచును. నిదురలోఁ గలవరించుచు మేలుకొని యున్నవారి ప్రశ్నములకు సదుత్తరము లిచ్చుటయు, వారితో సంభాషించుటయు నసహజ మేమియుఁ గాదు. తొందరగా నాప్రదేశము నుండి వెడలిపోవుచుండిన వాసవదత్తను బట్టుకొనుటకై వత్సరాజు పోవుచు ద్వారబంధము తగిలి నేలఁ బడుట మిక్కిలి సహజముగ నున్నది. వారిరువురుఁ బరస్పరము కలియుట కవకాశ మేర్పడినను, వెల్లడి యగుట కది సమయము కాకపోవుటచే నాసమావేశము నిపుణముగఁ బరిహరింపఁబడినది. వాసవదత్త వెడలిపోయినపిదప రాజు తాను గాంచినది స్వప్నమో, యథార్థమో తెలియక తికమక పడును. ఇట్టి యంకమంతయు మిక్కిలి ప్రతిభావంతముగ రచింపఁబడి సహజరామణీయకములో నొప్పారుచున్నది.

ఈ యంకమునందలి కడపటిభాగమున యౌగంధరాయణుఁడు వత్సమగధసైన్యముల రెంటిని సమీకరించి యప్పుడే గంగానదిని దాటునట్లు చేయఁగలిగె నని తెలియుచున్నది. యౌగంధరాయణుని కార్యదీక్ష యిందలి చిన్నిప్రకటనముచేఁ దెలియవచ్చుట మాత్రమే కాక మొదటియంక

మునకుఁ బిదపఁ బ్రేక్షకులకు దర్శన మొసఁగెడి యీవ్యక్తియే కథామాత్రము నంతను నిర్వహించుచుండె నని తెలియుచున్నది. ఇచ్చట భాసుఁడు ప్రదర్శించినవస్తుధ్వని నిరుపమాన మైనది. ప్రథమాంకము కడపట యౌగంధరాయణుఁడు వెడలిపోయినపిదప తిరిగి పంచమాంకమున వత్సమగధ సైన్యములు గంగానదిని దాటిన వని చేసినప్రకటన మారెండు కార్యములకును మధ్య నుండఁదగినకాలమాత్రమునుబట్టి సమర్థనీయమే యగుచున్నది.

## షష్ఠాంకము

కాంచుకీయునికిని, ప్రతీహారికిని జరగినసంభాషణముతో నీయంకము ప్రారంభ మగుచున్నది. దానినిబట్టి వత్సరాజు తమశత్రు వగు నారుణిని జయించి తాను మునుపు కోలుపోయినరాజ్యము నంతను దిరిగి జయించె నని తెలియుచున్నది. కాని వాసవదత్త మీటుచుండినఘోషవతీ దర్శనముచే వత్సరాజు వాసవదత్తను స్మరించుచు విషణ్ణహృదయుఁడై యుండును. ఆసందర్భమునఁ గాంచుకీయుఁడు వచ్చి మహాసేనునికడనుండి రైభ్యుఁడను కాంచుకీయుఁడును, వసుంధర యనువాసవదత్తదాదియు వచ్చి యున్నారని రాజునకుఁ దెలుపవలసినదిగఁ బ్రతీహారిని గోరును.

అంత రాజు ఘోషవతిని జేతఁ బట్టుకొని ప్రవేశించును. "నిన్ను బొందితిని గాని నిన్ను మీటుచుండినప్రేయసిని మాత్రము పొంద నైతిని" అని యాతఁడు నిట్టూర్చును. ప్రతీహారియు రైభ్యాదుల యాగమనమును గూర్చి విన్నవించును. రాజును వెంటనే పద్మావతికొఱకై కబురు పంపును. పద్మావతియుఁ బ్రవేశించి వాసవదత్త స్వజనము తనకును స్వజన మగుటచే వారిని గలిసికొనుట కుత్సహించును. మహాసేనుఁడును, నాతనిదేవి యంగారవతియు నేమి చెప్పుదురో యని వా రిరువురును నాందోళనపడ సాగిరి.

అంత రైభ్యుడును, వసుంధరయు వత్సరాజును సమీపింతురు. రైభ్యుడు మహాసేనుని సందేశము వినిపించును. వాసవదత్తదాది యగు వసుంధరయు నంగారవతీదేవి పంపినసందేశమును వినిపించి యామె పంపిన చిత్రపటములను జూపును.

మహాసేనుఁడును, నాతనిదేవియుఁ దనపై నింకను ననురాగమే చూపుచున్నందులకు వత్సరాజు మిక్కిలి సంతోషించెను. పద్మావతి వాసవదత్త చిత్రపటమును జూచి యది తనకడ నున్నయావంతికను బోలి యుండుటచే నాశ్చర్య మంది యావిషయమును వత్సరాజునకు నివేదించును. అతఁడును కుతూహలముతో నావంతికను వెంటనే పిలిపింప వలసినదిగాఁ బద్మావతిని గోరును. అతని హృదయమునఁ దిరిగి యాస ననలెత్త సాఁగెను. కాని యింతలోఁ బ్రతీహారి వచ్చి ద్వారముకడ నొకబ్రాహ్మణుఁడు వచ్చి యున్నాఁడనియుఁ, బద్మావతికడఁ దాను న్యాసముగ నుంచి యుండినతన సోదరి నావంతికను దీసికొని పోఁదలచుచున్నాఁడనియుఁ జెప్పును. ఈ వార్త వత్సరాజునకు నిరుత్సాహము గలిగించెను. అవంతిక బ్రాహ్మణుని సోదరియే యగుచో నామె వాసవదత్త యెట్లగు నని యాతఁడు సంశయించెను.

వృద్ధబ్రాహ్మణవేషమున నున్నయౌగంధరాయణుఁడు డోలాందోళితమనస్కుఁడై యుండినవత్సరాజును సమీపించును. వాసవదత్తను దాఁచుటలోఁ దనయుద్దేశము మంచిదే యైనప్పటికిని, దనప్రయత్నము లన్నియు సఫలము లైనప్పటికిని, రాజు తన్నే మనునో యని యౌగంధరాయణుఁడు భయ మంద సాఁగెను. ఇంతలోఁ బద్మావతి వాసవదత్తను బిలుచుకొని వచ్చును. వాసవదత్త పరపురుషదర్శనమును బరిహరించునదగుటచేఁ జాటున నొదిఁగి యుండును. అప్పుడు వాసవదత్తదాది యగు వసుంధర వాసవదత్తను గుర్తించి 'రాజకుమారి వాసవదత్త!' యని పలుకును వత్సరాజు మిక్కిలి సంతోషించి యామె నంతఃపురమునకుఁ బొమ్మని

కోరును. కాని యౌగంధరాయణుం డప్పుడు పద్మావతికడ న్యాసముగ నుంచినతనసోదరిని రాజట్లు బలాత్కారముగాం గొంపోవుట తగ దని పలుకును. అప్పుడు వత్సరాజెల్లర సందేహములను బోకార్చుటకై తెరసు దొలంగింపవలసిన దని కోరును. వాసవదత్తయు "ఆర్యపుత్రులకు జయము" అని పలుకును. అప్పుడు యౌగంధరాయణుండు వత్సరాజు ముందు మోకరిల్లి తన తప్పిదమును క్షమింప వేడును. వత్సరాజును యౌగంధరాయణుని స్వామిభక్తి యెఱింగినవాం డగుటచేం దనకు రాజ్య ప్రాప్తి చేకూర్చినయౌగంధరాయణుని వేనోళ్ళం గొనియాడెను. పద్మావతియు వాసవదత్తను దనసెచ్చెలిగ మాత్రమే చూచినందులకు క్షమింప వలసిన దని వేండుకొనును. వాసవదత్తయుం బద్మావతి తనభర్తకు రెండవ భార్యగా నుండుటకుం దనయంగీకారమును దెలుపును.

వత్సరాజు గోలుపోయినరాజ్యము నంతను దిరిగి సంపాదించు సదుద్దేశములోనే తాను వాసవదత్తను దాచిపెట్టవలసి వచ్చిన దని యౌగంధరాయణుండు వివరించును. పిదప వారందఱును మహాసేనునికిని, నాతని దేవికిని నాసంతోషవార్తం దెలుపుటకొఱకై యుజ్జయినికి బయలుదేరి పోవుదురు.

విమర్శము :

ఈయంకము మొదట నున్నవాక్యములో నాటకము సుఖాంతముగ ముగియంగల దనుట సూచింపంబడినది. ప్రతీహారి యొకతె వచ్చి తనపేరు విజయ యని పలుకును. దీనినిబట్టి విజయము రానున్న దని మనకుం దెలియును. యౌగంధరాయణుండు నాటకప్రారంభమున సంకల్పించిన సంకల్ప మీ యంకమున ఫలవంత మైనది. ఉదయనుం డారుణిని జయించి వత్సదేశము నంతను దనహస్తగతము చేసికొనెను. ఇందుచే వాసవదత్తయుం ద్వరలోనే వత్సరాజును జేరవలసి యున్నది. కథాసరిత్సాగరమున వాసవదత్త మధ్యమార్గమునం దనసోదరుం డగుగోపాలకుని యంతఃపురమునకుం

బోవును. పద్మావతియు, వత్సరాజును నామెను వెదకుకొనుచుఁ బోయియచ్చట నామెను గుర్తింతురు. ఇట్లందు వాసవదత్త పునస్సమాగమ మేర్పడినది. కాని భాసుఁడు వారి కిరువురికిఁ గల్పించినపునస్సమాగమము మూలములోకంటె మనోజ్ఞముగా నున్న దనుట యతిశయోక్తి గాదు. మహాసేనుఁడును, నతనిదేవియును సందేశ మంపె నని విన్నంత నే వత్సరాజును, బద్మావతియు నే మని తలపోయుదురో యిందుఁ జక్కఁగఁ జిత్రింపఁబడినది. మానవహృదయమును జక్కఁగ నర్థము చేసికొనుట మాత్రమే కాక దానిని గన్నులకుఁ గట్టునట్లు ప్రదర్శించుటలోఁ గూడ భాసుఁ డెట్టిప్రజ్ఞను గనుపఱిచెనో యీసన్నివేశమునుబట్టి మనకుఁ దెలియుచున్నది.

యౌగంధరాయణుఁడు తాను సంకల్పించినసంకల్పము విజయవంత మగుటను గన్నులారఁ గాంచి పరితృప్తి వహించుటతో నీనాటకము సమాప్త మగుచున్నది.

## పాత్రచిత్రణము

## (Character Sketches)

### ఉదయనుఁడు

ఉదయనుఁడు వత్సరాజు. భరతవంశమునకుఁ జెందినరాజసత్తముఁడు. ఈతని తండ్రి సహస్రానీకుఁడు. తల్లి మృగావతి. ఉజ్జయినీనగరాధిపతి యగుమహాసేనునికుమార్తె యగువాసవదత్త యితని మొదటి భార్య. మగధ రాజకుమారి పద్మావతి రెండవభార్య.

ఉదయనుఁ డీనాటకమునఁ దనభార్యయందు గాఢానురక్తుఁ డగు ననుకూలనాయకుఁడుగాను, మహోదారపురుషుఁడుగాను దర్శన మొసఁగుచున్నాఁడు. వాసవదత్త యళీకమరణమునుగూర్చి విన్నతరువాతను, బద్మావతిని వివాహ మాడినతరువాతను గూడ నాతఁడు వాసవదత్తనే స్మరించుచుండెను. రాజ్యకార్యములయందు శ్రద్ధ లేక యెప్పుడును నంతఃపురవినోదములఁ బ్రొద్దుపుచ్చు హర్షునిప్రియదర్శిక, రత్నావళి యనునాటకములందలి వత్సరాజువంటివాఁడు కాఁ డితఁడు. ఇతనియందుఁ బేర్కొనఁదగినగుణము వాసవదత్తయెడ నీతనికిఁ గలయనురాగము. అతని యీయనురాగాధిక్యము

తనకు బాగుగాఁ దెలియుటచేతనే దర్శకుఁడు తనసోదరి యగుపద్మావతిని వాసవదత్త జీవించియుండఁగా నాతనికీయఁ దలఁప లేదు. యౌగంధరాయణుఁడు నంగుచేతనే వత్సరాజునకుఁ దెలియకుండ వాసవదత్తను దాఁచి యుంచ వలసి వచ్చినది. తాను వివాహమాడినకాంతను వత్సరా జెంత గాఢముగ ప్రేమింపఁ గలుగునో తెలిసిన పిదపనే పద్మావతి వత్సరాజుపై ననురాగము వహించును. వాసవదత్తయెడ వత్సరాజునకుఁ గలగాఢానురాగ మెట్టిదో పంచమాంకములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

క॥ అది స్వప్నమె యయ్యెడుచో
నిదురయె తా ధన్య మగు ననిందితలీలన్
అది సత్యమె యగుచో న
చిరకాల ముండి యలరించుత నన్.

కాని వాసవదత్తయెడ నాతనికిఁ గలగాఢానురాగ మాతనిని పద్మావతియెడఁ బ్రేమరహితునిగఁ జేయలేదు. అతఁ డామెయెడలను ననురాగము గలిగి యుండి యామె మెత్తనిహృదయమును, తెలివితేటలను, చక్కని రూపమును బ్రశంసించెను. కాని వాసవదత్తయందు లగ్నమైనతనహృదయమును మాత్ర మాతఁడు మరల్పఁజాలకుండెను.

అవసరము వచ్చినప్పు డాతఁడు తనదుఃఖము నంతను మఱచి భుజపరాక్రమము నెఱపఁగలఁడు. పంచమాంకమున నాతఁడు పుట్టెఁడుదుఃఖమున మునిఁగి యుండఁగా వత్సమగధసైన్యములు గంగను దాటిన వని కాంచుకీయునివలన నెఱిఁగి యాతఁడు తనదుఃఖము నంతను దిగమ్రింగికొని యారుణి మీఁదికి యుద్ధమునకుఁ బోవును.

తనయత్తమామ లగునంగారవతీమహాసేనులపై నాతనికి గొప్పగౌరవము గలదు. పద్మావతిసోదరుఁ డగుదర్శకునియెడలను నాతఁ డట్టిగౌరవమునే ప్రదర్శించుచుండెను. అంగారవతీమహాసేనులకడనుండి సందేశము వచ్చిన దని వినినంతనే యాతఁడు తనమనస్సునఁ దలపోసినతలపోఁత లాతని ముగ్ధమధురస్వభావమునకు, ధర్మగుణమునకు దృష్టాంతములు.

తన సేవకుల రాజభక్తిని జక్కఁగా నర్థము చేసికొని వారి ప్రశంస నీయ మైనసేవను వత్సరాజు గుర్తించు నని షష్ఠాంకమునందు మనకుఁ దెలియుచున్నది. వాసవదత్తను దాఁచి యుంచినందులకు రాజు తన్నేమనునో యని యౌగంధరాయణుఁడు మిక్కిలి భయ మందును. కాని వత్సరాజాతని సేవను, స్వామిభక్తిని వేనోళ్ళఁ గొనియాడి యాతని నభినందించును.

## వాసవదత్త

వాసవదత్త యుజ్జయినీనగరాధిపతి యగుమహాసేనుని కుమార్తె వత్సరాజు మొదటిభార్య. శ్రీ హర్షుఁడు రచించినప్రియదర్శిక, రత్నావళి యనునాటకములలోని వాసవదత్తవలె ననూయారూమూర్తిగాఁ గాక యీ నాటకమున నీమె మహోదారవ్యాదయగను, త్యాగశీలగను జిత్రింపఁబడి యున్నది. భాసుఁడు చిత్రించినపాత్రములలో నెల్ల వత్సరాజుపాత్రమును నీ వాసవదత్తపాత్రమును మిక్కిలి మనోజ్ఞములు!

వాసవదత్తలోఁ జేర్కొనఁదగినగొప్పగుణ మామెకుఁ గలభర్తృప్రేమము. తనభర్తృప్రేమలో మఱొక్కతె తనతోఁ బాలు పంచుకొనుట నామె సహింపఁ జాలదు.—కాని యంతమాత్రమున నామె తనకర్తవ్యము నెన్నఁడును విస్మరింపలేదు. తనమగఁడు కోలుపోయినవత్సరాజ్యముఁ దిరిగి సంపాదింపవలయు ననిన దర్శకునిసహాయ మవసర మనియు, నా దర్శకుని సహాయముఁ బడయుటకుఁ బద్మావతిని వత్సరాజు వివాహ మాడుట తప్పనిసరి యనియుఁ దెలిసినపిదప నామె స్వార్థమును గూడఁ ద్యాగము చేసి పద్మావతీవత్సరాజుల వివాహము సిద్ధింపఁజేయుటకై కార్యరంగమున నడుగిడును. ఆమె యెప్పుడును దనమగని క్షేమమునే కాంక్షించుచుండెను. పద్మావతి వత్సరాజునకు దత్త యయ్యె నన్నవృత్తాంతమును విన్నవెంటనే వాసవదత్త "ఆయన క్షేమముగా నున్నాఁడా?" యని ప్రశ్నించును. "వత్సరాజు తన్ను గాఢముగాఁ బ్రేమించుచుండె నని

యామెకుఁ దెలియును. అందుచేతనే వత్సరాజు తనవలని విరహమును సహింపలేక యారోగ్యమును గోలుపోవు నని యామె తలపోసెను. అందు కనిదే యామె వెంటనే పయివిధముగాఁ బ్రశ్నించినది. పద్మావతీ వత్స రాజుల వివాహము జరగుచుండఁగా నామె యొంటరిగా నక్కడి యుద్యాన వనమునకుఁ బోయి 'యార్యపుత్రుని మఱలఁ జూడఁగలుగుదు నను నాస చేతనే నేను బ్రాణములతో జీవించియుంటిని' అని పలుకును. చతుర్థాంక మున వత్సరాజు తనకొఱకై విలపించుచుండుటను జాటున నుండి చూచు చుండి తా నజ్ఞాతముగా నచ్చట నుండుట కూడ నొకవిధముగా మంచికే యయిన దని యామె సంతోషించును. స్వప్నసన్నివేశమున నామె "యిచ్చట ముహూర్తకాల ముండి నాచూపును, హృదయమును సంతోష పెట్టెదను" అని పలికెను. ఈ పలుకులలో నామెకు వత్సరాజునెడఁ గల ప్రేమాధిక్యము వెల్లడి యగుచున్నది.

భర్తృప్రేమమును గూడఁ ద్యాగము చేయఁగల త్యాగశీల యన్నంత మాత్రమున వాసవదత్తలో స్త్రీసహజము లగుగుణములు కొన్ని లేక పోలేదు. వత్సరాజే "స్త్రీస్వభావ మరసి చూడఁగఁ గాతరం బగును గాదె!" యని స్త్రీస్వభావమునుగూర్చి తెలిపి యున్నాఁడు. ప్రథ మాంకమున నామె కనఁబడినది మొదలుకొని తిరిగి వత్సరాజుతోఁ బునస్సమాగమముఁ బడయుదాఁక నామె హృదయము విభిన్నభావసంఘర్ష ణములకుఁ దావలమై క్షోభ మందును. పద్మావతి తన్ను న్యాసముగ స్వీకరించునో లేదో యని యామె తొలుత సందేహించినది. అట్లే తపో వనమునఁ బ్రవేశించునప్పు డామె మగధరాజభటుల యవినయప్రవర్తన మును జూచి తనభావిజీవిత మెట్టికష్టములకుఁ దావల మగునో యని విచా రించినది. పద్మావతీవత్సరాజుల వివాహమునకుఁ దానుగా యౌగంధ రాయణునికిఁ దోడ్పడ నిశ్చయించిన యీయామె బ్రహ్మచారి తనవలని విరహముచే వత్సరాజు విలపించినవిధమును వర్ణింపఁగా "ఆర్య యౌగంధ రాయణుఁ డిప్పుడు సకాముఁ డగుఁ గాక" యని స్త్రీసహజముగఁ బలికెను.

అట్టి పద్మావతికి వత్సరాజుతో వివాహము నిశ్చయ మైన దని వినినంతనే తన యునికిని, సర్వమును మఱచి యామె 'దారుణ!' మని తనహృదయావేదనను బ్రకటించును. 'వత్సరాజే స్వయముగఁ బద్మావతిని వివాహ మాడ వచ్చెనా లేక దర్శకుఁడే యాతని వివాహ మాడఁ గోరెనా ?' యున్నవిషయమును దెలిసికొనుట కామె చూపినకుతూహలము మిక్కిలి స్త్రీసహజముగా నున్నది. పద్మావతిని వివాహ మాడినపిదపఁ గూడఁ దనభర్త తన్ను స్మరించుచుండెనో లేదో యని యామె యెఱుఁగఁ గోరును. పద్మావతీవత్సరాజుల వివాహమును దానే సంకల్పించినను వారివివాహము జరగునప్పు డామె "ఆర్యపుత్రుఁడు కూడఁ బరకీయుఁ డగుచున్నాఁడు" అని పలుకుట యామెలోని స్త్రీత్వమే పలికిన ట్లున్నది. ఇట్లామె స్త్రీసహజము లైనయసూయాది బలహీనతలు గలిగి స్త్రీస్వభావముయొక్క మూర్తిభావముగా మన కీనాటకమున భాసించుచున్నది.

తనభర్తయెడ నామెకుఁ గలప్రేమాధిక్యముచే నామె తనమధురప్రకృతిని, విశాలహృదయమును గోలుపోవ లేదు. ఆమె యనేకసందర్భములఁ దన యుదారహృదయమును, నసూయారహితచిత్తవృత్తిని బ్రకటించెను. పద్మావతిని జూచినవెంటనే 'ఈమె రూపము మాత్రమే కాదు. ఈమె వాక్కు కూడ మిక్కిలి మధురముగా నున్నది' యని యామెను బ్రశంసించెను. చతుర్థాంకమునఁ బద్మావతి వాసవదత్త నింకను వత్సరాజు స్మరించుచుండుటలో నేమియుఁ దప్పు లే దని పలికినప్పుడు వాసవదత్త యామెయౌదార్యమును బ్రశంసించెను. షష్ఠాంకమునఁ బద్మావతి తన్ను క్షమింప మని వేఁడినప్పు డామె యట్లు చేయుటలోఁ దప్పేమియు లే దని వాసవదత్త ప్రకటించును. పద్మావతియెడ వాసవదత్త యెట్టి గాఢస్నేహము గలిగి యుండెనో పద్మావతిచెలికత్తెలకును బాగుగాఁ దెలిసి యుండెను. అందుచేతనే యొకచేటి 'పద్మావతికిఁ దలనొప్పిగా నున్న దని మాత్ర మావంతికకుఁ దెలుపుము. అది విని యామెయే పద్మావతికడకు రాఁగలదు' అని పలికి యుండెను.

భాసుఁ డీనాటకమునం దంతటను వాసవదత్తను గొప్పప్రజ్ఞాశాలినిగాఁ జిత్రించి యున్నాఁడు. పద్మావతి వత్సరాజును బ్రేమించుచున్నదో లేదో యని తెలిసికొనుటకై ద్వితీయాంకమున వాసవదత్త జరపినసంభాషణ మామె ప్రజ్ఞకుఁ జక్కనినిదర్శనము. మఱియుఁ జతుర్థాంకమునందు వత్సరాజు పద్మావతిని బ్రేమించుచుండెనా యని యడిగి తనపై నాతనికిఁ గలయనురాగమును దెలిసికొనఁ దలఁచుటలోఁ గూడ నామె ప్రజ్ఞ వ్యక్తమగుచున్నది. వాసవదత్త మిక్కిలి సమయస్ఫూర్తి గలది. అప్రయత్నముగఁ దననోట వెలువడినమాటలచేఁ జిక్కుపరిస్థితులలోఁ దగులుకొనినప్పు డామె తనసమయస్ఫూర్తిచే మిక్కిలి మెలఁకువగాఁ దప్పించుకొనెను. ద్వితీయాంకమున నొకచోట నామె 'వత్సరాజు మిక్కిలి యందముగా నుండు' నని పలుకును. వెంటనే పద్మావతి 'యది నీ కెట్లు తెలియు?' నని యామెను బ్రశ్నించును. వాసవదత్త వెంటనే తనసమయస్ఫూర్తిని బ్రకటించి యుజ్జయినిలో నట్లు చెప్పుకొందు రని పలికి యప్పటి చిక్కునుండి తప్పించుకొనును. పద్మావతి వత్సరాజున కొసంగఁబడిన దని విన్నంతనే యామె నోట నప్రయత్నముగ 'దారుణము!' అనుమాట వెలువడెను. కాని వెంటనే తాను నోరు జాఱినందులకు నొచ్చుకొని యామె "వాసవదత్తకొఱకై యట్లుగా విలపించినవత్సరాజు పద్మావతిని వివాహమాడ నంగీకరించుట దారుణమే" యని చెప్పి యప్పటిచిక్కునుండి తప్పించుకొనును. అట్లే చతుర్థాంకమున పద్మావతికంటె వాసవదత్తయే వత్సరాజు నెక్కువగఁ బ్రేమించుచుండె నని పలుకును. కాని తనతప్పు నెఱిఁగి వెంటనే యామె "స్వజనమును గూడ వీడి వాసవదత్త వత్సరాజు వెంట వచ్చుటచే నామె కాతనియెడఁ బ్రేమ యధిక మని తాను భావించి" నట్లు చెప్పి యప్పటికిఁ దప్పించుకొనెను. ఇట్లు వాసవదత్త తనప్రజ్ఞను, సమయస్ఫూర్తిని బ్రకటించినసందర్భము లీ నాటకమున ననేకములు గలవు.

ద్వితీయాంకమున నీమె పద్మావతిని వేళాకోళము చేయుటలో నీమెకుఁ గలహాస్యాభిరుచి వెల్లడి యగుచున్నది. విషాదసందర్భములందుఁ గూడ నామెయందు సహజముగ నుండుహాస్యగుణ మామెను విడనాడ లేదు. ఇట్టి వాసవదత్తకు వత్సరాజు తన హృదయము నంకితము చేయుటలో నెట్టి యాశ్చర్యమును లేదు. అందుచేతనే యాతఁడు 'ఆకృవల యాత్మీఁ దలఁప కెటు లుండు నుత్తరోత్తరభవముల?' యని పలికి యుండెను.

## పద్మావతి

పద్మావతి మగధరాజగుదర్శకుని సోదరి. వత్సరాజు రెండవభార్య. వత్సరాజామెనుగూర్చి 'అందచందములను, శీలమందు నెందుఁ గొఱఁత లేక పద్మావతి కూర్చు నాకు' నని చెప్పి యున్నాఁడు. వసంతకుఁడును వత్సరాజు ప్రశ్నమునకు సమాధానము చెప్పుచు నామె సుగుణముల నెల్ల నిట్లు పేర్కొనును. 'పూజ్యురాలు పద్మావతి తరుణి, అందగత్తె, కోపము లేనిది, అహంకారము లేనిది, తీయగా మాటలాడునది, దాక్షిణ్యముతోఁ గూడినది.' వాసవదత్త యామెను దనసోదరివలెనే ప్రేమించి యామెమధురహృదయమును, మహౌదార్యమును గొనియాడును. తాపసి, కాంచుకీయుఁడు, చెలికత్తెలు మొదలగువారు కూడ నామె సుగుణములను బ్రశంసింతురు. యౌగంధరాయణుఁ డంతటివాఁడు పద్మావతినిగూర్చి "యీధీర కన్యక ధర్మచిత్తశక్తురాలు నాసోదరిచరితఁ గావ" నని యీమె గుణములను బ్రశంసించి యామె సౌశీల్యముమీఁది నమ్మకముచేతనే తనప్రయత్నమునకు సాహసముతోఁ బూనుకొనును. ఇట్లు పద్మావతి యెల్లర ప్రేమాదరములను జూఱగొనట కామెసుగుణములే కారణము.

ప్రథమాంకమున నామె తాపసియెడఁ జూపినగౌరవము వాసవదత్తను ముగ్ధురాలినిఁ జేసివైచినది. "రూపము మాత్రమే కాదు. ఈమె వాక్కు కూడ మధురమైనది గదా'యని వాసవదత్త యీమెను బ్రశంసించును.

తనకడ న్యాసముగా నుంపఁబడినవాసవదత్త నామె 'నీ విప్పుడు నా కాత్మీయురాల వైతివి' యని స్వీకరించును. ఇతరుల మనోభావములను గౌరవించుగొప్పసుగుణ మీయామెలో నుండుట విశేషము. వాసవదత్త పరపురుషదర్శనమును బరిహరించు నని తెలిసి యామె కోరిక నీడేర్చును. తనభర్తతోఁ గూడ నెక్కువ చనవు తీసికొని ప్రవర్తింపక యాతని మనోభావములను గూడ గౌరవించును. చతుర్థాంకమున వత్సరాజు వాసవదత్తను స్మరించుచు సంతోషించుచుండె నని తెలిసి యాతనికడకుఁ బోయినయెడల నతఁడు బాధపడు నేమో యని యచ్చటికిఁ బోవుటను విరమించును. వత్సరాజుముఖము కన్నీటిచేఁ దడియుటకు వసంతక వత్సరాజులు చెప్పిన కారణ మసత్య మని తనకుఁ దెలిసినను, నాతఁడు బాధపడు నని వారిమాటలు నమ్మినట్లుగ నటించును. అంగారవతీమహాసేనులకడనుండి సందేశముఁ దెచ్చి రని వినినప్పుడు కూడ నీమె వత్సరాజుకడ నుండుట మంచిది కాదని తలఁచుట కదియే కారణము. నాటకాంతమున వాసవదత్తను దన నెచ్చెలి యని భావించినందులకుఁ దన్ను క్షమింపవలసిన దని పద్మావతి వేఁడుటలో నామె శీలము పరమావధి చెందుచున్నది. ఈ సుగుణమునే వత్సరాజు 'శీలమాధుర్య' మని పేర్కొనెను.

వాసవదత్తవలెనే పద్మావతియు మంచి తెలివితేటలు గలది. వాసవదత్త మరణించిన దని బ్రహ్మచారివలనఁ దెలిసిన పిదపనే యామె వత్సరాజునుఁ బ్రేమింపఁ దొడఁగును. ఆమె హృదయమునం దసూయకుఁ దావు లేదు. తనవివాహము జరిగినపిమ్మటఁ గూడ వత్సరాజు వాసవదత్తను స్మరించుచుండుటఁ జూచి యామె యసూయఁ జెందలేదు. ద్వితీయాంకమున నీ దగువరముఖమును జూడఁ దలఁచుచున్నా నని శ్లేషగాఁ బలుకఁ బద్మాపతి యందలి శ్లేషను గుర్తించి దానికిఁ దగినసమాధాన మొసఁగును. వత్సరా జందముగా నుండు నని వాసవదత్త పలుకఁగానే 'అది నీ కట్లు తెలియును' అని పద్మావతి వెంటనే ప్రశ్నించును. చతుర్థాంకమున వసంతకుఁ డడిగినప్రశ్నకు వత్సరాజు

వెంటనే సమాధానము చెప్పక పోవుటకుఁ గారణము నీమె యూహింపఁ గలుగును. షష్ఠాంకమునందలి చిత్రపటదర్శనావసరమునఁ గూడ నీమె యావంతికయును, వాసవదత్తయును గంజపోలికను సులభముగ గుర్తించును.

పద్మావతిలోఁ జేర్కొనఁ దగిన మఱొకసుగుణము చాపలికము లేమి. తాను వీణ నేర్చు మని వత్సరాజును గోరినప్పు డాతఁడు బదులు పలుకక నిటూర్చినవృత్తాంతము నీమె చాపలికము లేక చెప్పుటయే కాక దానిఁబట్టి నీ వేమి యనుకొంటివి! యని వాసవదత్త ప్రశ్నింపఁగా నీమె వాసవదత్తపైఁ గలగాఢానురాగముచేతనే యాతఁ డట్లు ప్రవర్తించి యుండు నని బదులు పలుకును. కాని పద్మావతి మాత్ర మా విషయముఁ దెలిసినపిదపఁ గూడ నిరుత్సాహము నెంద లేదు. వాసవదత్తయే యాస్థితిలో నుండినయెడల నామె తప్పక యా పరిస్థితికి దుఃఖించి యుండెడిది! కాని వత్సరాజునకు వాసవదత్తయెడఁ గలగాఢానురాగమును స్మరించి స్మరించి యామెకుఁ దలనొప్పి యెత్తును. అయ్యు నామె తనలోని మనోభావములను వెలికిఁ బ్రకటింపక గంభీరముగా నుండును. ఆమె యీగుణమునే వత్సరాజు చతుర్థాంకమున, 'ధీరురా లీమె యయి నను స్త్రీస్వభావ మరసి చూడఁగఁ గాతరం బగును గాదె" యనుచో ధీరురా లన్నపదమునఁ బ్రశంసించి యున్నాఁడు. యౌగంధరాయణుఁడును నామె సౌశీల్యముపైఁ గలవిశ్వాసముచేతనే యట్టిమహాయత్నమునకుఁ గడంగును. కాంచుకీయుఁడు వల దని వారించు చున్నను బద్మావతి వాసవదత్తను న్యాసముగ స్వీకరించి యౌగంధ రాయణునివిశ్వాసమును సార్థకముఁ జేయును.

కథాసరిత్సాగరమునందు వాసవదత్తాపద్మావతు లిరువురును నానందా భ్యుదయములయు, యశస్సంపదలయు నధిదైవతములుగఁ జేర్కొనఁబడిరి. ఈ నాటకమునుబట్టి పద్మావతి నిజముగా సౌభాగ్యాధిదైవత మని చెప్పుట కెట్టి సందేహమును లేదు.

## యౌగంధరాయణుఁడు

యౌగంధరాయణుఁడు వత్సరాజుమంత్రి. స్వామిభక్తిపరాయణుఁడు. కార్యదీక్షామహితుఁడు. సంకల్పసిద్ధుఁడు. ఇతఁ డీ నాటకమందలి ప్రథమాంకమునందును, షష్ఠాంకమునందును మాత్రమే మనకుఁ గానవచ్చుచున్నను, నతని వ్యక్తిత్వము మాత్రము ప్రేక్షకులహృదయముల యందు హత్తుకొని పోవుచున్న దనుటలో సందేహము లేదు. భాసుఁ డీతని గుణగణములను, రాజకీయచతురతను, గార్యదీక్షను మఱింత గొప్పగాఁ జిత్రించుటకొఱకే యాతనిని తెరవెనుకనే యుంచినాఁడు. మంత్రిసత్తమునకుండవలసినదూరదర్శిత్వము, రాజకీయచతురత, సాహసము, కార్యచోదకత్వము మొదలగుగుణము లన్నియు యౌగంధరాయణునియందు మూర్తీభవించి యున్నవి.

నాటకకథ యంతయుఁ బూర్తిగా యౌగంధరాయణునిమీఁదనే యాధారపడి యున్నది. వాసవదత్తను దాఁచి యుంచుటయం దాతఁడు ప్రదర్శించినదూరదర్శిత్వము మిక్కిలి ప్రశంసనీయము. వాసవదత్తను దాఁచి యుంచుటచేతనే వత్సరాజును, దర్శకుఁడును వివాహసంబంధముఁ జేసికొనుటకు వీ లైనది. బ్రహ్మచారి చెప్పినలావాణకవృత్తాంతమువలన వాసవదత్త మరణించినవిషయము లోకమునందు వెల్లడియగుటయే కాక పద్మావతి వత్సరాజును ప్రేమించుటకును దోహద మొసఁగినది. గొప్ప ప్రజ్ఞాశాలి యగుటచే నీతఁడు జరుగనున్నవిషయముల నెల్ల ముందుగనే యూహించి తదనుగుణముగాఁ బ్రవర్తించును. తనభర్త శ్రేయస్సుకొఱకును, రాజ్యశ్రేయస్సుకొఱకును వాసవదత్త ఫలుకష్టములకు గుఱి కావలసి వచ్చినను యౌగంధరాయణుఁడు వాసవదత్తవిషయమై నిర్దయుఁడై ప్రవర్తింపలేదు. పద్మావతితోఁ గొంతకాల మున్నయెడల నామెతోఁ గలిసి భర్తృప్రేమమును బంచుకొనుటయందు వాసవదత్తకట్టి యభ్యంతరము నుండ దని యాతఁడు తలపోయును. అందుచేతనే యాతఁడు వాసవదత్తను బద్మావతి

కడనే న్యాసముగ నుంచును. దీనివలన మఱొక్క ప్రయోజనము కూడఁ జేకూడినది. వాసవదత్తశీలమునకుఁ బద్మావతి పూఁటగా నుండునవకాశ మింతేర్పడినది. ఇట్లు యౌగంధరాయణుఁడు దూరదృష్టితోఁ జేసిన యాలోచన లన్నియుఁ దుదకు సఫలము లైనవి. పద్మావతీవాసవదత్త లిరువురును బరస్పరము ప్రేమాదరములు గలిగి ప్రవర్తించుటనుబట్టి యాతని దూరదర్శిత్వము వెల్లడి యగుచున్నది.

తనప్రయత్నమున కడ్డు వచ్చు నాటంకములను యౌగంధరాయణుఁడు సహింపఁజాలఁడు. ప్రథమాంకమున పద్మావతి వెంట నుండినమగధ రాజభటుల యమానుషప్రవర్తనము నాతఁడు గర్హించెను. వాసవదత్త యాసందర్భమునఁ దనప్రయత్న మంతయు వ్యర్థ మగు నేమో యని భయ మందఁగా నీతఁడు 'కాలవశమున జగతి భాగ్యములు గూడఁ బరఁగుచుండును జక్రారపంక్తివోలె' నని యామె నూఱడించును.

ఆరుణిపై యుద్ధమున కాతఁడు సలిపినప్రయత్న మాతని యుద్ధనీతి వైశారద్యమునకుఁ జక్కనినిదర్శనము. వాసవదత్తతోఁ గూడ నగ్నియందుఁ బడి యీతఁడు మరణించె నని లోకమున వెల్లడి యగుటచే నీతఁ డీ యుద్ధ ప్రయత్నవిషయమున బహిరంగముగాఁ గాక రహస్యముగా మాత్రమే వర్తింపవలసి వచ్చెను. ఈఘట్టమున నీతఁడు చూపినప్రజ్ఞ నిస్సామాన్యము.

యౌగంధరాయణునియందుఁ జెప్పఁదగిన మఱొక్క సుగుణ మాతని స్వామిభక్తితత్పరత, స్వార్థరహితసేవ. ఆరుణితోడి యుద్ధమున జయ మందినపిదప నీతఁడు షష్ఠాంకమునందు వాసవదత్తను దాఁచి యుంచినందులకు రాజు తన్నే మనునో యని భయ మందును. ఇది యాతనికి రాజునెడఁ గలగౌరవమును, నాతనిహృదయములో దాఁగియుండినమానవత్వమును బ్రకటించుచున్నది. వత్సరాజు తనప్రయత్నమునెడ హర్షము వెలిబుచ్చి, తన స్వామిభక్తి నభినందించినప్పుడు గాని యాతఁ డూఱట నెందలేదు. స్వార్థరహితచిత్తముతో 'నేలినవారి భాగధేయముల ననుసరించు

వారము 'మే' మని పలుకుటలో నీతని వినయగుణము ప్రతిభాసించు చున్నది.

## వసంతకుఁడు

సాధారణముగా సంస్కృతనాటకములయందుఁ గానవచ్చు విదూషకపాత్రమునకును, నీనాటకమునందలి విదూషకుఁ డగువసంతకుని పాత్రమునకును జాల భేదము గలదు. విషణ్ణహృదయుఁడై యున్న వత్సరాజునకు వినోదముఁ గల్పించుచు నాతని నూఱడించుచుండుటకై యౌగంధరాయణుఁ డీతని నియోగించెను. ఇతఁడును స్వామిభక్తి కలవాఁ డగుటచేఁ దనరాజునకు దుఃఖసమయములయందు వినోదము గల్పించుచు వాసవదత్తనుండి యాతని హృదయమును మఱల్పఁ బ్రయత్నించుచుండెను.

రాజు నూఱడించుటకు వసంతకుఁడు సల్పినప్రయత్నము లాతని శీలమును వ్యక్తము చేయఁగలవు. వత్సరాజు వాసవదత్తను స్మరించి దుఃఖించుచుండఁగా నీతఁడు పద్మావతీవిషయమును బ్రస్తావించి యాతని మనస్సును మఱల్పఁ జూచును. కాని యాతఁ డింకను నామెనే స్మరించుచుండుటఁ జూచి యాకసమునఁ బోవుచుండినబెగ్గురుపక్షులబారును జూపును. అతఁడు కొంతసేపు తనదుఃఖమును మఱచును. తిరిగి యాతఁడు వాసవదత్తకై విలపించు నేమో యని యాయుద్యానవనములోని పుష్పగుచ్ఛములను జూపును. ఎన్నివిధములుగా యత్నించినను నాతఁడు తిరిగి యథాస్థితుఁ డగుటను జూచి వసంతకుఁ డాతని హృదయమును విప్పి చెప్పు మని కోరును. ఆ సమయమున నాతఁ డేమియుఁ దెలియనిమూఢునివలెఁ బ్రవర్తించి వత్సరాజు తనప్రేమమును వ్యక్తముగాఁ జెప్పునట్లు చేయును. పంచమాంకమున వత్సరాజు పద్మావతికిఁ దలనొప్పిగా నున్నదని విచారించుచుండఁగా నేలపైఁ బడియున్న పూలమాలను సర్ప మని తలఁచి భయపడినట్లుగా నటించును. అది చూచి రాజు చిఱునవ్వు నవ్వును. పిదప రాజునకు వినోదమును గల్పించుటకై కథలు చెప్పుసందర్భమున రాజు పేరును, నగరము పేరును దారు

మారు చేయును. వత్సరాజు వాసవదత్త జీవించియే యున్న దని తన స్వప్నవృత్తాంతమును జెప్పుచుండఁగా నీతఁ డది స్వప్నమే యనియు వాసవదత్త చాలకాలము క్రిందనే మరణించిన దనియుఁ దెలిపి యాతని నంతఃపురము లోనికిఁ గొంపోవును.

ఇందు వసంతకుని హాస్యము మిక్కిలి నున్నతముగా నుండి, ప్రేక్షకహృదయముల నావర్జించుచున్నది. కాకిగ్రుడ్లు తిరిగినట్లుగా నని చెప్పుటకు బదులు 'కోకిలగ్రుడ్లు తిరిగినట్లు నాకడుపులో నేదో గిరగిర మని తిరుగుచున్నది' యనునప్పుడును, 'బ్రహ్మదత్త మని యొకనగరము కలదు. అందు కాంపిల్యుఁ డనురాజు పరిపాలించుచుండె'నని రాజుపేరును, నగరముపేరును దారుమారు చేసినప్పుడును హాస్యము కలుగుచున్నది. అతఁ డవంతిసుందరి యనుపేరు గలయక్షిణి రాజాంతఃపురమున నున్న దని చెప్పినప్పుడు ప్రేక్షకుల కది వాసవదత్తయే యని తోఁపక పోదు. వసంతకుఁ డిట్లు యౌగంధరాయణునికి సహాయభూతుఁడుగా నుండి యాతని ప్రయత్నసాఫల్యమునకు మిక్కిలిగాఁ దోడ్పడును.

## నాటకలక్షణములు

### దశవిధరూపకములు :

నాటకమునకు నాట్యము, రూపము, రూపకము ననునవి నామాంతరములు. అందు రూపకము - నటునియందు రామాది నాయకత్వమును నారోపించుటచేత నది రూపక మనఁబడుచున్నది. ఇది శృంగారాదిరసముల నాశ్రయించి యొప్పుచుండును. రూపకము : 1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5. డిమము 6. వ్యాయోగము 7. సమవాకారము 8. వీథి 9. అంకము 10. ఈహామృగము అని పదివిధములు. వీనికి దశవిధరూపకము లని పేరు. వీనిలో నాటకము తక్కినరూపకముల కన్నిటికిని బ్రకృతి యై సంపూర్ణలక్షణము గలిగి వెలయుచున్నది.

సూత్రధారుఁడు :

సూత్ర మనఁగా సబీజక మగు నాట్యానుష్ఠానము. దానిని బ్రవర్తింపఁ జేయువాఁడు సూత్రధారుఁడు.

పూర్వరంగము :

పూర్వరంగ మనఁగా నాట్యశాల. దానియందు నిర్విఘ్నముగా నాట్యప్రదర్శనము జరుగుటకై రూపకాదియందుఁ జేయఁదగినకృత్యవిశేషము పూర్వరంగ మనఁబడును.

నాంది :

నాటకమునందు దీనికి (పూర్వరంగమునకు) నిరువది రెండంగములు గలవు. వానిలో ముఖ్యముగా విఘ్నశాంతికై చేయఁ దగినది నాంది. ఆశీర్నమస్క్రియాదిరూప మగుమంగళాచరణము నాంది యనఁబడును. ఇది యెనిమిది గాని, పండ్రెండు గాని, పదునెనిమిది గాని, యిరువదిరెండు గాని పదములతోఁ గూడి యర్థముచేఁ గాని, శబ్దముచేఁ గాని కొంచెముగాఁ గావ్యార్థమును సూచించునదిగా నుండవలయును.

ఇట్టి నాందీరూప మగుపూర్వరంగ మొనరించి సూత్రధారుఁడు వెడలినపిదప నాకారగుణములయందు వానిని బోలిన యింకొకనటుఁడా నామముతోనే రంగభూమిని బ్రవేశించి కావ్యార్థసూచనముఁ జేయవలయును. దీనిని బట్టి సూత్రధారు లిద్దఱనియు, నం దొకఁడు పూర్వరంగప్రవర్తకుఁ డనియు, నటుఁడు, స్థాపకుఁడు నని పేరు గలరెండవ సూత్రధారుఁడు ప్రస్తావనాప్రవర్తకుఁ డనియుఁ దెలియవలయును. మొదటివానికి నాందీసూత్రధారుఁ డనియు, రెండవవానికిఁ బ్రస్తావనా సూత్రధారుఁ డనియుఁ గూడఁ బేర్లు కలవు.

ఈసందర్భమున నాటకప్రారంభములయందుఁ గానవగు ' నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి ' యనుదానికి నాంది యొనరించి మొదటివాఁడు వెడలినపిదప రంగస్థలమునఁ బ్రవేశించినరెండవసూత్రధారుఁ డని తెలియవలయును. సాధారణముగా సంస్కృతనాటకములయందుఁ

తొలుత నాందీశ్లోకమును, పిదప 'నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి' యనుసూచనమును గాననగును. కాని భాసకృతులలో నాందీశ్లోకమునకు ముందే పైసూచనము కానవచ్చుచున్నది. ఇందుచే భాసకృతులలోని తొలిశ్లోకము నాందీశ్లోకము కాదనవలసి వచ్చును. కాని యాశ్లోకములందు నాందీశ్లోకలక్షణము గానవచ్చుచుండుట గమనార్హమయినవిషయము!

దివ్యమర్త్యమిశ్రరూపంబు లగునితివృత్తములకుఁ దగినయాకారాదులు గలవాఁ డగురెండవ సూత్రధారుఁడు మొదటఁ గావ్యార్థసూచకము లగుచక్కనిపద్యములచే రంగభూమిని రంజింపఁజేయుచు వస్తువు, పాత్రము, బీజము, ముఖము అనువానిలో నేదే నొకదానిని సూచించును.

## ప్రస్తావన :

రెండవసూత్రధారుఁడు రంగస్థలమును రంజింపఁజేయుట మొదలుగా వస్తువుమొదలగువానిలో నొకదానిని సూచించి నిష్క్రమించువఱకుఁ గల యది ప్రస్తావన యనఁబడును. దీనికే 'యాముఖ' మనియుఁ బేరు. కొన్ని ప్రాచీనరూపకములలో-అనఁగా భాసనాటకములయందు-దీనికి 'స్థాపన' యనుపేరు కనఁబడుచున్నది. భాసకృతులలోఁ గానఁబడు నీస్థాపన మిక్కిలి చిన్నదిగా నుండును. ఇతరనాటకములలో సాధారణముగాఁ బ్రస్తావనములయం దాదినమునఁ బ్రదర్శింపఁబడునాటకమును గూర్చియు, దానిని రచించినకవీశ్వరునిగూర్చియుఁ బ్రశంస యుండును. కాని భాసకృతులలోని స్థాపనలయం దట్టి ప్రస్తావ మేదియుఁ గానరాదు.

సూత్రధారుఁడు మారిషునితోఁ గాని, నటితోఁ గాని, విదూషకునితోఁ గాని ప్రస్తుతకథాసూచకముగాఁ దమకార్యముగూర్చి చిత్రమైనసంభాషణ మొనరించుటయే ప్రస్తావన యనఁ బరఁగును. ఇందు మారిషునకు మార్షుఁడు, పారిపార్శ్వకుఁడు నని నామాంతరములు కలవు.

## ప్రస్తావనాంగములు :

కథోద్ఘాతము, ప్రవృత్తకము, ప్రయోగాతిశయము అనునవి ప్రస్తావన కంగములు. ప్రస్తావనలయందు నిం దేదైన నొకటి యుండఁదగును.

1. కథోద్ఘాతము :—సూత్రధారుని వాక్యములందుఁ బ్రస్తుత కథకుఁ గలియునట్టివాక్యమును గాని, దాని యర్థమును గాని కైకొని పాత్రము ప్రవేశించుట కథోద్ఘాత మనఁబడును.

2. ప్రవృత్తకము :—ప్రస్తావనలోఁ బ్రవృత్త మైనఋతు సమాన గుణవర్ణనచే సూచింపఁబడినపాత్రము ప్రవేశించుట ప్రవృత్తక మనఁ బడును.

3. ప్రయోగాతిశయము :—ఈ, ఇది, యీతఁడు అని సూత్రధారునిచే నిర్దేశింపఁబడినపాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయ మనఁబడును.

విష్కంభము :—రంగస్థలముపైఁ బ్రత్యక్షముగాఁ జూపఁ గూడనికథావస్తువును విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకాస్యము, అంకావతారము అనునైదింటిచేత సూచింపఁ దగును.

జరగినవియు, జరగఁబోవునవియు నగుకథాంశములను సంగ్రహముగాఁ దెలియఁజేయుచు మధ్యమపాత్రలచేతఁ బ్రయోగింపఁ బడునది విష్కంభ మనఁబడును.

విష్కంభము శుద్ధవిష్కంభ మనియు, మిశ్రవిష్కంభ మనియు రెండువిధములు. ఒకఁడు గాని, యిద్దఱు గాని మధ్యమపాత్రములను గలిగి యుండునది శుద్ధవిష్కంభము. మధ్యమాధమపాత్రములను గలిగి యుండునది మిశ్రవిష్కంభము. మిశ్రవిష్కంభమునకే సంకీర్ణవిష్కంభ మనియుఁ బేరు.

ప్రవేశకము :—ఇదియు విష్కంభమువలెనే జరగి నవియు, జరగఁబోవునవియు నగుకథాంశములను సంగ్రహముగాఁ దెలుపునదియై, యొకనిచేఁ గాని, యిద్దఱచేఁ గాని నీచపాత్రములచేఁ బ్రయోగింపఁబడును. ఇది ప్రథమాంకప్రారంభమున నుండఁదగదు.

భరతవాక్యము :—ఇది నాటకాంతమునఁ గానఁబడు శుభాశంసనశ్లోకము. నాటకమునందలి ప్రధానపాత్రములలో నొకఁడీ భరతవాక్యమును వచించును. భరతుఁ డనఁగా నటుఁ డని యిచట సామాన్యార్థము.

# నాటకప్రాశస్త్యము

స్వప్నవాసవదత్తము భాసనాటకచక్రమునందు మాత్రమే కాక సంస్కృతనాటకప్రపంచమునందే యసామాన్యమైన దవి ప్రశస్తి గాంచినది. ప్రాచీనసంస్కృతనాటకసంప్రదాయానుసారముగాఁ జూచినను, నాధునికనాటకవిమర్శనపద్ధతులఁబట్టి పరిశీలించినను నీనాటకము సంస్కృత-నాటకప్రపంచమునకే వన్నె దెచ్చు నాటకరాజ మని చెప్పఁదగియున్నది.

సంస్కృతాలంకారికులు నిర్వచించిననాటకధర్మములు కొన్ని యిందుఁ బాటింపఁబడక పోయినప్పటికిని నీనాటకము చాలవఱకు సంస్కృతనాటకసంప్రదాయము ననుసరించియే రచింపఁ బడినట్లు తెలియుచున్నది. సుప్రసిద్ధము లగుప్రాచీనగ్రంథములలోని యుదయనకథ యిందలి వృత్తముగ స్వీకరింపఁబడుటచే నిందలియితివృత్తము ప్రఖ్యాత మని చెప్పఁదగును. ఇందలినాయకుఁడు గొప్పరాజవంశమునకుఁ జెందినరాజు. సాధారణముగ సంస్కృతనాటకములలో ధీరోదాత్తుఁడు గాని, ధీరలలితుఁడు గాని నాయకుఁడు కాఁదగుదురు. ఈనాటకమునందలి నాయకుఁడు పయి రెండుతెగలకును జెందినవాఁ డగుచున్నాడు. ఆరుణితోడి యుద్ధమున నాతఁడు చూపినపరాక్రమ మాతఁడు ధీరోదాత్తుఁ డనుటకుఁ దగియున్నది. సంగీతాది లలితకళలయం దాతఁడు ప్రత్యేకాభిమానముఁ జూపుటచే నాతఁడు ధీరలలితుఁ డను తెగకును జేరును. ఇతఁడు సచివాయత్తసిద్ధి గల నాయకుఁ డగుటచే నాతని యభ్యుదయ మంతయుఁ జాలవఱకు నాతని మంత్రి యగుయౌగంధరాయణునిమీఁద నే యాధారపడి యున్నది. ఇందలి ప్రధానరసము విప్రలంభశృంగారము. ఆరుణితోడి యుద్ధమున నీతఁడు పరాక్రమము ప్రకటించి కొంతవఱకు వీరరసహేతు వైనను, తిరిగి యాతఁడు రంగస్థలముమీఁదికి వచ్చునప్పటికిఁ దనకు సహజమైనశృంగారావస్థయందే యుండును. ఇట్లు విప్రలంభశృంగారము నాటకమునం దంతటను బర్వియున్నది. స్థూలముగ నాటకనిర్మాణమును జూచినప్పటికిని నొక్కొక్కయంకమునకును మధ్య, నవసర మున్నచోట్ల మాత్రమే ప్రవేశకవిష్కంభాదులు రచింపఁబడినవి. అంకములు నాతిదీర్ఘములై హృదయంగమములై ప్రేక్షకుల కప్పటప్పటికి నాటకదర్శనమునందుఁ గుతూహలమును, నుత్సాహమును రేకెత్తించుచున్నవి.

ఆధునిక నాటక విమర్శపద్ధతులఁబట్టి చూచినను నీనాటకము గొప్ప ప్రతిభావంతుఁ డగుకవిసత్తమునిచే రచింపఁబడిననాటకరాజ మని తెలియఁ గలదు. ఇందుఁ బురుషకారముయొక్క యాధిక్యము చక్కఁగాఁ బ్రదర్శిత మయినది. స్వామిభక్తిపరాయణుఁ డగు యౌగంధరాయణుఁడు తన ప్రభువు కోలుపోయినరాజ్యమును దిరిగి సంపాదించి యాతని నందుఁ బునఃప్రతిష్ఠితునిఁ జేయ నిశ్చయించును. అందుకై యాతఁ డెట్టి యాటంకము వచ్చినను దాని నెల్ల ధైర్యముగ నెదుర్కొని తుదకుఁ దనప్రయత్నమున విజయముఁ గాంచును. యౌగంధరాయణుఁ డిందు నాయకుఁడు కాఁడు. అతఁ డీనాటకమున ప్రథమాంకమునను, షష్ఠాంకమునను మాత్రమే దర్శన మొసఁగుచున్నాఁడు. అయినను నీనాటకమునం దంతటను నాతనిప్రతిభాప్రభావసంపత్తియు, వెనుకంజ వేయని యాతనిపురుషకారమును నావరించి యున్నవి.

మఱియు నిందు మానసికశాస్త్రమునకు సంబంధించిన చక్కనిపరిశీలనము మన కిందలి పాత్రల సంభాషణలందును, ప్రవర్తనములందును గోచరించును. వాసవదత్త యొకవంకఁ దా నెన్నికష్టములకు లోనయినను దన భర్తను సేవింప నెంచును. కాని స్త్రీసహజ మైనయసూయ యప్పుడప్పుడు దానికి భంగము గలిగించుచుండెను. ఇందలి తృతీయాంకమున వాసవదత్తతన హృదయములోఁ జెలరేగినభావపరంపరల నెల్ల లోలోననే యడఁచుకొని బాధ పడవలసినదుస్థితి యేర్పడినది. చతుర్థాంకమున నాయికానాయకు లిరువురును నొకసెజ్జపైనే యుండి యొకరికై మఱొకరు ప్రలపింతురు. ఈ ఘట్టములోని మానసికభావచిత్రణము మిక్కిలి రమణీయముగఁ జేయఁబడినది. తృతీయాంకమున వాసవదత్తయే స్వయముగఁ గౌతుకమాలను గూర్ప వలసివచ్చినప్పుడు భాసుఁడు నెలకొల్పినక్లేశ కడుఁగడు హృద్యముగ నున్న దనుటలో నెట్టి సందేహమును లేదు.

ఒక యంకమునుండి మఱొకయంకమునకుఁ గథానిర్మాణము క్రమపరిణతితో ఫలాగమోన్ముఖముగ సాఁగుట మిక్కిలి ప్రతిభావంతముగ నిందు నిర్వహింపఁబడినది. ప్రథమాంకమునందలి బ్రహ్మచారివృత్తాంతమును, పంచమాంకమునందలి స్వప్నవృత్తాంతమును, షష్ఠాంకమునందలి చిత్రపటవృత్తాంతమును మిక్కిలి రమణీయముగఁ జిత్రింపఁబడినవి.

ఈ నాటకమునందలి మఱొక్క విశేష మేమనఁగా నిందలి ప్రతి
పాత్రమునకును వ్యక్తిత్వము కలదు. చిల్లరపాత్రములు కూడ మిక్కిలి
చక్కఁగాఁ బరిపోషింపఁబడియుండుట యిం దొకవిశేషము. ఇందలి ప్రతి
పాత్రము ప్రేక్షకుని హృదయమునందు హత్తుకొని పోవఁగల దనుట కెట్టి
సందియమును లేదు. ప్రొఫెసరు కీతుపండితుఁడు భాసునిపాత్రచిత్రణమును
మిక్కిలిగాఁ బ్రశంసించి యున్నాఁడు. యౌగంధరాయణుఁ డొక్కఁడో
యొండు రెండుస్థలములఁ దప్ప నీనాటకమునం దెచ్చటను దర్శన మొసఁ
గఁడు. కాని యాతని పురుషకారమును, ప్రతిభాసంపత్తియు నీనాటక
మునఁ దత్ప్రియత్నసాఫల్యముచే మిక్కిలి చక్కఁగాఁ బ్రదర్శింపఁబడినవి.
వత్సరా జీనాటకమునందుఁ దొలిసారిగఁ జతుర్థాంకమందే దర్శన మొసఁగు
చున్నను నతని యౌదార్యము, సుదాత్తత, లలితకళాభిరుచి, వాసవదత్త
యెడఁ గలగాఢానురాగము మొదలగుసద్గుణము లన్నియుఁ బ్రేక్షకులకు
నాటకప్రారంభమునుండియే తెలియుచున్నది. రుమణ్వంతుఁడు, మహా
సేనుఁడు, అంగారవతీదేవి, దర్శకుఁడు నను వారు రంగముపై మనకుఁ గాన
రాక పోయినప్పటికిని వారిసద్గుణములు మనమనస్సులకుఁ జక్కఁగ హత్తు
నట్లు భాసుఁడు చిత్రింపఁ గలిగినాఁడు. వాసవదత్త, పద్మావతి, దాది,
తాపసి, కాంచుకీయులు – ఒకరేమి – నాటకములోని యన్నిపాత్రములును
మనకన్నులకుఁ గట్టునట్లు చిత్రింపఁబడిరి.

ఇందుఁ జేర్కొనఁదగినమఱొక్కసుగుణము ప్రసన్నము, మధురము
నైనయితని శైలి. ఇతరసంస్కృతనాటకకర్తలవలెఁ గాక యితఁడు తన
నాటకమున సంభాషణములకే యెక్కువ ప్రాధాన్య మొసఁగెను. వారి
వలె నీతఁ డతిమాత్రముగాఁ బద్యములకూర్పు చేయలేదు. దీర్ఘసమాస
భూయిష్ఠ మైనభవభూతికవి వచనశైలితోఁ బోల్చి చూచినప్పుడు గాని
భాసుని ప్రసన్నమధుర మైనవచనశైలియొక్క ప్రాశస్త్యము తెలియదు.
దీర్ఘసమాసభూయిష్ఠ మైనశైలికంటె సులభవచనశైలియే నాటకములం
దనుసరణీయ మని వేఱుగాఁ జెప్ప నవసరము లేదు.

'భాసనాటకచక్రేపి చ్ఛేకైః క్షిప్తే పరీక్షితుం
స్వప్నవాసవదత్తస్య దాహకోఽభూన్న పావకః'

అని రాజశేఖరుఁడు స్వప్నవాసవదత్తమునుగూర్చి పలికినప్రశంసలో నతిశ
యోక్తి యావంతయు లేదు!

# పాత్రములు

**పురుషులు :**

ఉదయనుఁడు—వత్సరాజు
యౌగంధరాయణుఁడు—ఉదయనుని మంత్రి
వసంతకుఁడు—ఉదయనుని వయస్యుఁడు, విదూషకుఁడు
బ్రహ్మచారి—లావాణకగ్రామవాస్తవ్యుఁడు
కాంచుకీయుఁడు—మగధరాజు కాంచుకీయుఁడు
రైభ్యుఁడు—అవంతిరాజగుమహాసేనుని కాంచుకీయుఁడు
సూత్రధారుఁడు—ప్రయోగప్రవర్తకుఁడు
సంభషకుఁడు, భటుఁడు—మగధరాజభటులు

**స్త్రీలు :**

వాసవదత్త—మహాసేనుని కుమార్తె, వత్సరాజు మొదటిభార్య
పద్మావతి—మగధరాజగుదర్శకుని చెల్లెలు, ఉదయనుని రెండవభార్య
తాపసి—ఆశ్రమమున నివసించునది
చేటి—పద్మావతి చెలికత్తె
దాది—పద్మావతి దాది
వసుంధర—వాసవదత్త దాది
పద్మినిక, మధుకరిక—పద్మావతి చెలికత్తెలు
విజయ—ప్రతీహారి

—

# స్వ ప్న వా స వ దత్తము

## ప్రథమాంకము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్రధారుఁడు-

గీ॥ ఉదయనవశీతకరరుచిసదృశమును, వ
సంతకమనీయమును నయి జగతిఁ బరఁగి
లలి నవాసవదత్తనిర్బలతతోడ
నంద మై యొప్పు నేది పద్మావతీర్ణ
పూర్ణ మయ్యాది బలరాము భుజయుగంబు
మనుచుఁ గావుత మిమ్ము సంపదల నొసఁగి.

ఆర్యమిశ్రుల కిట్లు విజ్ఞాపింతును......ఆఁ! యేమిది? నేను విజ్ఞాపింప నుండఁగా నేదో శబ్దము వినవచ్చుచున్నది! మంచిది. చూచెదను గాక!

(నేపథ్యమున)

తొలఁగుఁడు, తొలఁగుఁడు. అయ్యలారా! తొలఁగుఁడు.

సూత్ర - ఓహో! తెలిసినది.

ఆ॥ మహితభక్తి గలుగుమగధాధిపతిభృత్య
గణము రాజకన్యఁ గరము గొలిచి
వచ్చుచుండి యిపుడు బల్మిఁ దపోవనిఁ
గలుగుజనముఁ దొలఁగఁ గడచుచుండె.

(నిష్క్రమించును)

ఇది స్థాపన.

(ఇద్దఱుభటులు ప్రవేశించి)

భటులు — తొలఁగుఁడు, తొలఁగుఁడు. అయ్యలారా! తొలఁగుఁడు.

(పరివ్రాజకవేషమున యౌగంధరాయణుఁడును, నావంతికా వేషమున వాసవదత్తయుఁ బ్రవేశింతురు)

యౌగంధరాయణుఁడు — (చెవి యొగ్గి) ఇక్కడఁ గూడ జనులను దొలఁగించుట యెట్లు? ఏలనఁగా —

చ॥ వనములలో వసించుచును
వన్యఫలంబుల నారగించుచుం
దనివిని బొంది వల్కలముఁ
దాల్చెడు ధీరుని భీతుఁ జేయుచున్
వినయము లేనివాఁ డెవఁడొ
వీఁ డొకఁ డస్థిరభాగ్యవిస్మితుం
డనయము సల్పుచుండెఁ
దనయాజ్ఞఁ దపోవనముం బురంబుగా.

వాసవదత్త — ఆర్యా! తపోవనజనము నిట్లు తొలఁగించుచున్నవా రెవరు?

యౌగం — తల్లీ! ధర్మమునుండి తమ్ముఁ దాము తొలఁగించుకొనువారు.

వాసవదత్త — ఆర్యా! అది కాదు నాయభిప్రాయము! నేనుగూడఁ దొలఁగింపఁబడుదునా యేమి? అని.

యౌగం- తల్లీ! అజ్ఞాతము లగుభాగధేయము లిట్లే యవమానితము లగును.

వాస- ఆర్యా! యీ పరిభవము గలిగించినంత పరిఖేదమును నా పడినపరిశ్రమ యంతయుఁ గూడ నాకుఁ గలిగింపలేదు.

యౌగం- అమ్మా! యిది నీవు బాగుగా ననుభవించి విడిచినదే గాని వేఱు గాదు. అందుచే నీ విటుఁ జింతింపరాదు.

సీ॥ పడఁతి! యేయది నీ కనుభవగతంబో
మగని విజయంబుతో నద్ది మరలఁ గలుగుఁ
గాలవశమున జగతి భాగ్యములు కూడఁ
బరఁగుచుండును జక్రారపంక్తివోలె.

భటులు- తొలఁగుఁడు. అయ్యలారా! తొలఁగుఁడు.

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుడు- సంభ్రమక! వలదు. వలదు. తొలఁగి పొమ్మన వలదు.

ఆ॥ ముసలపట్లఁ బరుషములను బల్కఁగ రాదు
ధరణిపతికి దానఁ బరఁగు నింద
నగరసంభవములఁ దెగనాడ వనముల
కేఁగుదెంచి వార లిట వసింత్రు.

ఇద్దఱు- ఆర్యా! సరే! అట్లే చేయుదుము.

(నిష్క్రమింతురు)

యౌగం- ఓహో! విచక్షణతోఁ గూడినది గదా యితని చూపు! బిడ్డా! ఇతనిదగ్గఱకుఁ బోవుదము రమ్ము.

వాస- ఆర్యా! సరే!

యౌగం- (సమీపించి) అయ్యా! జనము నిట్లు తొలఁగించుచున్నా రెందులకు?

కాంచు- తపస్వివర్యా!

యౌగం- (ఆత్మగతము) తపస్వి యను నీసంబోధనము గుణవంతము కదా! కాని పరిచయము లేక పోవుటచే నామనస్సు దాని నంగీకరింపకున్నది.

కాంచు- అయ్యా! వినుఁడు. పెద్దలచే దర్శకుఁ డని పిలువఁబడు మా మహారాజులుంగారి చెల్లెలు పద్మావతీదేవి యీ యాశ్రమమున నివసించుతల్లిని - రాజమాతను - పెద్దరాణిగారిని సందర్శించి యామెకడ ననుజ్ఞఁ బొంది తిరిగి రాజగృహమునకు మరలి పోవుచున్నది. ఈదిన మీ యాశ్రమపదమునం దామె నివసింపఁ దలఁచినది. అందుచేత-

గీ॥ పుణ్యజలములు దర్భలుఁ బుష్పచయము
సమిధ లాదిగ మునితపస్సాధనముల
వలసినట్టుల నాశ్రమపదమునుండి
యిచ్ఛమై మీర లెల్ల గ్రహింప వచ్చు.

గీ॥ ధర్మతత్పర యగునట్టిధరణిపాల
పుత్రికారత్న మిచటి తపోధనులకు

ధర్మపీడన మగుట నుంతయు సహింప
దిది కులవ్రత మాయుమ కెంచి చూడ.

యౌగం- (స్వగతము) ఓహో! పుష్పకభద్రాదు లగునా దేశికులచేఁ బ్రభువులవారికి దేవి కాఁగల దని యాదేశింపఁబడినమగధరాజపుత్రి పద్మావతి యీ మెయే యగును. అందుచేత నే-

గీ॥ ద్వేషబహుమానములు ప్రభవించుచుండుఁ
దలఁచు సంకల్పమునుబట్టి నరుల కెందుఁ
బ్రభువునకుఁ బత్నిఁ గోరుభావంబుకతన
నీమెయెడ నాకు స్వత్వంబు హెచ్చు కలదు.

వాసవదత్త- (స్వగతము) రాజపుత్రిక యనుమాట విని నంతనే యీమెయెడ నాకు సోదరీస్నేహము పొడము చున్నది.

(అంత సపరివారయై పద్మావతియుఁ, జేటియుఁ బ్రవేశింతురు)

చేటి- భర్తృదారికా! రమ్ము. రమ్ము. ఇదే యాశ్రమ పదము. ప్రవేశింపుము.

(అంత నుపవిష్టురాలై తాపసి ప్రవేశించును)

తాపసి- రాజకుమారికి స్వాగతము.

వాసవదత్త- (స్వగతము) ఈబిడయేనా రాజకుమారిక? అభిజనానురూపము గదా యీమెరూపము!

పద్మావతి- అమ్మా! నమస్కరించుచున్నాను.

తాపసి- చిరంజీవ! రమ్ము. బిడ్డా! రమ్ము. తపోవనము లనఁగా నతిథిజనమునకు స్వగృహములవంటివే సుమా!

పద్మావతి- అవును. అది నిజము. అమ్మా! అట్లే తలఁచుచున్నాను. ఈ బహుమానవచనముచేత నను గృహీతురాల నయితిని.

వాసవదత్త- (స్వగతము) రూపము మాత్రమే కాదు. ఈమె వాక్కు కూడ మధుర మయినది కదా!

తాపసి- బిడ్డా! (చేటితో) ఈ మీరాజసోదరి నేరాజకుమారుఁడును వరింపలేదా?

చేటి- ఉజ్జయినియందుఁ బ్రద్యోతుఁ డనురాజు కలఁడు. అతఁడు తనకుమారునికొఱకై రాయబార మంపినాఁడు.

వాసవదత్త- బాగు! బాగు! ఇప్పుడు కూడ నీమె నా కాత్మీయురాలే యయినది.

తాపసి- ఈ యాకృతి యిట్టి గౌరవమునకుఁ దగినదే కదా! ఉభయరాజకులములును మహత్తరము లయిన వని విందుము.

పద్మావతి- అయ్యా! నన్ననుగ్రహించుటకు మును లెవ్వఁరేని నగపడిరా? అభిమతప్రదానమునకై తపస్విజన మాహ్వానింపఁబడుఁ గాక! ఎవరెవరి కేమేమి కావలయునో యది కూడఁ దెలిసికొనుఁడు.

కాంచుకీయుఁడు- చిత్తము. అమ్మగారి సెలవు ప్రకారమే చేయుదును. ఆశ్రమవాసు లగు నోతపస్వులారా! వినుఁడు. వినుఁడు. మీ విస్రంభము చేత నుత్పాదింపఁబడినవిస్రంభము గలది, పూజ్యురాలు నగుమగధ రాజపుత్రి యిపుడు ధర్మార్థము ధనముతో మి మ్మాహ్వానించుచున్నది.

చ॥ కలశము వస్త్రయుగ్మకముఁ
గావలె నేరికి? బ్రహ్మచర్యముం
దలఁచినయట్లుగా నెఱపి
ధన్యుఁ డెవం డెది యొజ్జ కీయఁగాఁ
దలఁచెనొ చెప్పుఁడా! నృపజ
ధర్మకృతిప్రియ యెల్ల యీప్సితం
బుల నెఱవేర్చి మీదయను
బొందఁగఁ గోరుచు నున్న దియ్యెడన్.

యౌగంధరాయణుఁడు - బలే! ఉపాయము దొరకినది. (ప్రకాశముగా) అయ్యా! నే నర్థిని.

పద్మావతి- అదృష్టవశమున నా తపోవనాభిగమనము సఫలమయినది.

తాపసి- ఈ యాశ్రమపదమునందలి తపస్విజను లెల్లరును సంతుష్టులు. ఈతఁ డెవఁడో యాగంతుకుఁ డయి యుండును.

కాంచుకీయుఁడు- అయ్యా! యేమి కావలయును?

యౌగంధరాయణుఁడు- ఈమె నా చెల్లెలు. ప్రోషితభర్తృక. ఈమెను బూర్జ్వారాలు కొంత కాలము తమపోషణమున నుంచుకొని పరిపాలింపవలయు నని కోరుచున్నాను.

గీ॥ వలదు భోగంబు, లర్థముల్ వలదు నాకు,
వలదు వస్త్రాళి, పొట్టకై వల్కలములఁ
దాల్చ, నీ ధీర కన్యక ధర్మచిత్త
శక్తురాలు నాసోదరిచరితఁ గావ.

వాసవదత్త- (ఆత్మగతము) ఊఁ, ఆర్యయౌగంధరాయణుఁడు నన్నిచ్చుట నుంపఁ దలఁచుచున్నాఁడు. అగుఁ గాక! దూరము విచారింపక యాతఁ డేకార్యమును జేయఁడు.

కాంచుకీయుఁడు- అమ్మా! ఇతని ప్రార్థన గొప్పది. ఎట్లంగీకరింపఁ గలము? ఏల యన-

గీ॥ అర్థ మిచ్చుట సులభమే యగును, ప్రాణ
తపములను నిచ్చుటయుఁ గూడఁ దలఁప సులభ
మితర మేద్దైన సుఖముగా నీయవచ్చుఁ
గష్టకార్యంబు న్యాసరక్షణము తలప.

పద్మావతి- అయ్యా! యెవరి కేది కావలయునో కోరుఁ డని తొలుత నుద్ఘోషించి యిపుడు విచారించుట యుక్తము కాదు, ఇతఁ డేది యడుగునో దాని నార్యుఁ డనుష్ఠించును గాక!

కాంచుకీయుఁడు- అమ్మా! యిట్లు చెప్పుట మీ కనురూపము గానే యున్నది.

చేటి- భర్తృదారిక యిట్లే సత్యవాదినిగాఁ జిరకాలము జీవించును గాక !

తాపసి- బిడ్డా ! చిరంజీవిని వగుము.

కాంచుకీయుఁడు- అమ్మా ! యట్లే. (సమీపించి) అయ్యా ! పూజ్యురా లగుతమసోదరిని బరిపాలించుట కీపూజ్యురా లంగీకరించినది.

యౌగం- పూజ్యురాలిచే ననుగ్రహింపఁబడితిని. బిడ్డా ! పూజ్యురాలి ననుసరింపుము.

వాసవదత్త- (ఆత్మగతము) ఏది గతి ? మందభాగ్యను పోవుచున్నాను.

పద్మావతి- బాగు ! బాగు ! నీవు నా కిపు డాత్మీయురాల వయితివి !

తాపసి- ఈమె యాకృతినిబట్టి యీమెకూడ రాజదారికయే యని తర్కించుచున్నాను.

యౌగంధరాయణుఁడు - (ఆత్మగతము) అబ్బ ! సగము బరువు తీరినది. మంత్రులతో నెట్లాలోచించితినో సరిగా నట్లే జరగినది. ప్రభువులవారు రాజ్యమునఁ బునః ప్రతిష్ఠింపఁబడి, నే నీమె నాతనికడఁ జేర్చునపుడు పూజ్యురా లగుమగధరాజపుత్రి యీమెకుఁ బూఁట యై యుండఁగలదు.

ఉ॥ భూవరురాజ్ఞి యన్పదముఁ
బొందుట నిశ్చయ మెంచి చూడఁ బ

ద్మావతి, మావిపత్తులవిధం
బది మున్నుగఁ దెల్పినట్టియా
భూవిబుధుల్ వచించి రిటు,
పూనితి దాననె ప్రత్యయంబునం,
బోవునె సిద్ధవాక్యములు
పొల్లలుగా విధి వక్రమార్గ మై.

(అంత బ్రహ్మచారి ప్రవేశించును)

బ్రహ్మచారి- (ఊర్ధ్వము నవలోకించి) మధ్యాహ్న మయి నది. మిక్కిలి యలసి పోయితిని. ఎచ్చట విశ్రమింతును? (పరిక్రమించి) అవును. తెలిసినది. ఇది తపోవనముగా నున్నది.

సీ॥ హరిణముల్ చరియించు వెఱపులేమిని స్వేచ్ఛ
నాశ్రమాగత ప్రత్యయమునఁ జేసి
కరుణతోడుత ఋషివరులు పెంచినయట్టి
వృక్షముల్ ఫలపుష్పవితతి నెసఁగుఁ
దపసివర్యులసిరి కపిలగోతండంబు
విస్తారముగను గన్పింప దొసంగుఁ
జుట్టుపట్టుల నుండునట్టిప్రదేశముల్
సాగు చేసినయట్టిజాడ లేదు

గీ. హోమకుండంబులందుండి ధూమసమితి
వెడలుచున్నది యల్లదే విశదముగను
నిన్ని దృష్టాంతములు కానిపించుకతన
సందియము లేద యిద్ది యాశ్రమపదంబె.

ప్రవేశింతును గాక! (ప్రవేశించి) ఏ మిది! ఆశ్రమ విరుద్ధముగా నున్న దీజనము. (మఱొకవైపు చూచి) తపస్విజనము కూడ నిచ్చట నున్నది! దగ్గఱకుఁ బోవుటలోఁ దప్పు లేదు. ఏమిది? స్త్రీజనము!

కాంచుకీయుఁడు- అయ్యా! తాము స్వేచ్ఛగా లోనికి రావచ్చును. ఆశ్రమపద మనఁగా సర్వజనసాధారణము గదా!

వాసవదత్త- హుఁ.

పద్మావతి- అమ్మో! ఈ పూజ్యురాలు పరపురుషదర్శనమును బరిహరించును గదా! అగును. నాన్యాసము లెస్స పరిపాలింపఁదగినది!

కాంచుకీయుఁడు- అయ్యా! మే మిందుఁ దొలుతఁ బ్రవేశించితిమి. అతిథిసత్కారమును బ్రతిగ్రహింపుఁడు.

బ్రహ్మచారి- (ఆచమించి) మంచిది. మంచిది. అలసట తీరినది.

యౌగంధరాయణుఁడు- అయ్యా! ఎచ్చటనుండి తమరాక? ఎక్కడికిఁ బోవుచున్నారు? తమ స్వస్థల మేది?

బ్రహ్మచారి- అయ్యా! వినుఁడు. మాది రాజగృహము. వేదాధ్యయనముకొఱకై వత్సదేశమందు లావాణక మనుగ్రామమున నివసించుచుంటిని.

వాసవదత్త- (ఆత్మగతము) ఆఁ! లావాణకమా? లావాణకమును బేర్కొనినమాత్రముననే నా సంతాపము మరలఁ గ్రొత్తఁదనముఁ దాల్చుచున్నది.

యౌగంధరాయణుఁడు- అధ్యయనము పూర్తి గావించితివా?

బ్రహ్మచారి- లేదండి.

యౌగంధరాయణుఁడు- అధ్యయనము పూర్తి కానిచో నిట్లు వచ్చుటకుఁ గారణ మేమి?

బ్రహ్మచారి- అక్కడ నతిదారుణ మగు నొకయుపద్రవ మేర్పడినది.

యౌగంధరాయణుఁడు- ఏ మది?

బ్రహ్మచారి- అచ్చట నుదయనుఁ డనురాజు నివసించుచుండెను.

యౌగంధరాయణుఁడు- పూజ్యుఁ డగునుదయనునిగూర్చి విని యున్నాము. అతని కే మయ్యెను?

బ్రహ్మచారి- అవంతిరాజపుత్రి యగువాసవదత్త యనునామె యాతనికి మిక్కిలి కూర్చునిల్లాలు గదా!

యౌగంధరాయణుఁడు- కావచ్చును. తరువాత తరువాత.

బ్రహ్మచారి-మృగయావిహారార్థ మారాజు పోయి యుండఁగా గ్రామ మంతయు నిప్పంటుకొనుటచే నామె కాలి పోయినది.

వాసవదత్త- (ఆత్మగతము) అబద్ధము. పచ్చి యబద్ధము. మందభాగ్యను నేను జీవించియే యున్నాను.

యౌగంధరాయణుఁడు- తరువాత తరువాత?

బ్రహ్మచారి- తరువాత నామెను రక్షింపఁ దలఁచి యౌగంధరాయణుఁ డనుసచివుఁ డాయగ్నిలోనే పడెను.

యౌగంధరాయణుఁడు- పడినమాట వాస్తవమేనా? తరువాత తరువాత?

బ్రహ్మచారి- పిదప వేటనుండి మరలి వచ్చినరాజావృత్తాంతమును విని వారి వియోగమువలని సంతాపముచే నా యగ్నిలోనే పడి ప్రాణములను బరిత్యజింపఁ దలఁపఁగా నమాత్యులు బహుప్రయత్నమున నాతనిని వారింపఁ గలిగిరి.

వాసవదత్త- (ఆత్మగతము) ఎఱుఁగుదును. నాయెడ నార్యపుత్రులకుఁ గలయనురాగమును లెస్సగా నెఱుఁగుదును.

యౌగంధరాయణుఁడు- తరువాత తరువాత?

బ్రహ్మచారి- తరువాత నామె తన శరీరమునఁ దాల్చుచుండినదగ్ధశేషము లగునాభరణములను గౌఁగిలించుకొని రాజు మూర్ఛ నొందెను.

అందఱు- ఆఁ!

వాసవదత్త- (ఆత్మగతము) ఆర్య యౌగంధరాయణుని కోరిక యిపుడు సఫల మగుఁ గాక!

చేటి- భర్తృదారికా! ఈ పూజ్యురా లేడ్చుచున్నది!

పద్మావతి- జాలిగుండెచేత నయి యుండును.

యౌగంధరాయణుఁడు- తరువాత నేమి జరిగెను? తరువాత? నా సోదరి సహజముగనే జాలిగుండె గలది. తరువాత తరువాత?

బ్రహ్మచారి- తరువాత నాతఁడు మెల్లగా మూర్ఛనుండి తేరుకొనెను.

పద్మావతి- అదృష్టవశమున బ్రదికి యున్నాఁడు. మూర్ఛ పొందె నని విని నంతనే నాహృదయము శూన్య మై పోయినది.

యౌగంధరాయణుఁడు- తరువాత తరువాత?

బ్రహ్మచారి- తరువాత నారాజు నేలపైఁ బొరలుటచే శరీర మెల్ల దుమ్ము క్రమ్మఁగాఁ దొందరగా లేచి 'హా! వాసవదత్తా! హా! అవంతిరాజపుత్రీ! హా! ప్రియురాలా! హా! ప్రియశిష్యురాలా!' యని యేమేమో చాలఁగాఁ బ్రలాపించెను. వే యేల?

చ॥ వగపునఁ గూర వట్లు కవ
వాసి యలందురు చక్రవాకముల్
జగతిఁ దపింప రట్లు తమ
చానలఁ గోల్పడినట్టివారలుఁ
మగఁ డటు లేపడంతియెడ
మన్ననఁ జూపునో యామె ధన్య సూ
మగని ప్రియంబుకల్మి సతి
మండియు మండవియట్లు తోఁచెడుఁ.

యౌగంధరాయణుఁడు- అయ్యా! యాతని నోదార్చుట కాతని యమాత్యుఁ డెవఁడును బ్రయత్నింపనే లేదా?

బ్రహ్మచారి- రుమణ్వంతు డనునమాత్యుఁ డాపూజ్యు నోదార్చుటకు గట్టిగాఁ బ్రయత్నించుచునే యున్నాఁడు. అతఁడును,

ఉ॥ అన్నము ముట్టఁ డాత్మవిభునట్టుల,
సంతత మేడ్వ నోమునర్
విన్నఁదనంబు దోఁప, నృప
వీరునితో సమదుఃఖభాగి యై
చెన్నగ రేఁబవళ్లనక చేసెడుఁ
దాఁ బరిచర్య, ఏఁడు తా
విన్నను వేది ప్రాణముల
వీడిన నాతఁడు కూడ వీడెదుర్ .

వాసవదత్త- (స్వగతము) అదృష్టవశమున నార్యపుత్రుఁ డిపుడు మంచివారి రక్షణలోనే యున్నాఁడు.

యౌగంధరాయణుఁడు- (ఆత్మగతము) ఆహా! రుమణ్వాంతుఁడు గొప్ప బాధ్యతనే వహించు చున్నాఁడు. ఏల యన-

గీ॥ బరువు తగ్గుట విశ్రాంతిఁ బడసినాఁడ
నతని బాధ్యత దొడ్డ దై యలరుచుండు
నృపతి యతని కధీనుఁ డై నెగడుచుంట
సర్వ మతని యధీన మై సాఁగుఁ గాదె.

(ప్రకాశముగ) అయ్యా! ఆ రా జిపుడు స్వస్థచిత్తుఁ డయ్యెనా ?

బ్రహ్మచారి- ఇప్పటి సంగతి తెలియదు. ‘ఇక్కడ నామెతోఁ గూడి నవ్వితిని. ఇక్కడ నామెతోఁ గూర్చుంటిని. ఆమెపై నిక్కడఁ గోపించితిని. ఇక్కడ నామెతోఁ

గూడి పరుంటిని ' అని విలపించుచున్న రాజు నాతని యమాత్యులు పెద్ద ప్రయత్నముమీఁద నాగ్రామము నుండి తీసికొనిపోయిరి. అట్లా రాజు నిష్క్రమింపఁగా నా గ్రామము చంద్రుఁడును నక్షత్రములును లేని యాకాశమువలె నందముఁ గోల్పోయినది. పిదప నేను గూడ నందుండి వెడలి వచ్చితిని.

తాపసి- అపరిచితుఁ డయినయాతఁడు కూడఁ బ్రశంసించు చున్నందున నారాజు నిజముగా గుణవంతుఁడే యగును సుమా !

చేటి- రాజకుమారీ ! అన్యకాంత యాతని హస్తము నెట్లు పడయఁగలదు ?

పద్మావతి- (ఆత్మగతము) నా హృదయములో నున్నదానినే చెప్పినది.

బ్రహ్మచారి- పోవుదును. సెలవా ?

ఇద్దఱు- పొమ్ము. అర్థసిద్ధి యగును గాక !

బ్రహ్మచారి- తథాస్తు. (నిష్క్రమించును)

యౌగంధరాయణుఁడు- మంచిది. నేను గూడ నీ పూజ్యురాలివలన ననుజ్ఞఁ బొంది పోయెదను గాక !

కాంచుకీయుఁడు- పూజ్యురాలివలన ననుజ్ఞఁ బొంది యాతఁడు పోఁ గోరుచున్నాఁడు.

పద్మావతి- తమ సోదరి మిమ్ము వీడి యుండ లేక యుత్కంఠ గొను నేమో !

యౌగంధరాయణుఁడు- సాధుజనహస్తముల నుంపఁబడిన యీమె యుత్కంఠ గొనఁజాలదు. (కాంచుకీయునిఁ జూచి) అయ్యా! పోయెదను.

కాంచుకీయుఁడు- పునర్దర్శన మగుఁ గాక!

యౌగంధరాయణుఁడు-తథాస్తు. (నిష్క్రమించును)

కాంచుకీయుఁడు- అభ్యంతరగృహమును ప్రవేశించు వేళ యయినది.

పద్మావతి- అమ్మా! నమస్కరించు చున్నాను.

తాపసి- నీ కన్నివిధముల ననురూపుఁ డగుభర్తను బడయుదువు గాక!

వాసవదత్త- అమ్మా! నేను గూడ నమస్కరించుచున్నాను.

తాపసి- నీవు నచిరకాలమున భర్తను దిరిగి పొందుదువు గాక!

వాసవదత్త- అనుగృహీతురాలను.

కాంచుకీయుఁడు- రండు. పోవుదము. అమ్మా, ఇటు. ఇటు. ఇప్పుడు,

చ. పులుఁగులు సేరుచుండెఁ దమ
పొందికపట్టుల, మౌనిసత్తముల్
సలిలములందుఁ గ్రుంకు లిడ
సాఁగిరి, వహ్నియుఁ బ్రజ్వలించెడుం,

బాలిచెడు జన్నపుంబొగ తపోవన
 మెల్లెడఁ, దేరు ద్రిప్పి తా
వెలుఁగుల సంగ్రహించుకొని
 వేఁడివెలుం గదె యస్తమించెడుఁ౯.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

# ద్వితీయాంకము

(అంతఁ జేటి ప్రవేశించును)

చేటి- మంజరికా! మంజరికా! యెక్కడ నున్నది? భర్తృదారిక పద్మావతి యెక్కడ నున్నది? ఏమనుచున్నావు? ఇదిగో భర్తృదారిక మాధవీలతామండపముదగ్గఱఁ గందుకక్రీడ సలుపుచున్న దనియా? కానిమ్ము. భర్తృదారికను సమీపింతును గాక! (పరిక్రమించి చూచి) ఓ! చెవులతొడవులు నిక్కి నిలుచుండఁగా, వ్యాయామమువలనఁ బొడమిన చెమరునీరు గ్రమ్మినదియు, నలసట చెందుటచేత రమణీయ మయిన దర్శనము గలదియు నగు మొగముతోఁ గందుకక్రీడ సలుపుచు నిటే వచ్చుచున్నది. ఆమెదగ్గఱకుఁ బోయెదను.

(నిష్క్రమించును)

(అంతఁ గందుకముతోఁ గ్రీడించుచు సపరివారయై పద్మావతి వాసవదత్తతోఁ గూడఁ బ్రవేశించును.)

వాసవదత్త- చెలీ! ఇదిగో నీ బంతి.

పద్మావతి- అమ్మా! ఇప్పటి కింకఁ జాలును.

వాసవదత్త- చెలీ! చాలసేపు బంతియాట యాడుటవలన మిక్కిలి యెఱుపెక్కి నీ చేతు లితరులచేతులుం బలె నొప్పుచున్నవి.

చేటి- ఇప్పుడు రాజకుమారి తనివి తీఱ నాడవలసిన దే! కన్యా భావముచే రమణీయ మయిన యీ కాలము బాగుగా ననుభవింపఁబడును గాక !

పద్మావతి- అమ్మా! న న్నుపహసించుటకుకో యన నేల న న్నిటులు తేరి చూచుచున్నావు.

వాసవదత్త- లేదు. చెలీ! లేదు. నీ విపుడు మిక్కిలి యందముగాఁ గనఁబడుచున్నావు. నీ వరముఖమును నే నిప్పుడే చూడఁగలుగుచున్నాను.

పద్మావతి- హా మ్మావలకు. నాతోఁ బరిహాసము లాడకుము.

వాసవదత్త- మహాసేనుని కాఁగలకోడలా! ఇదిగో యూరకొనుచున్నాను.

పద్మావతి- ఎవ రీమహాసేనుఁడు ?

వాసవదత్త- ఉజ్జయినీ నగరాధిపతి ప్రద్యోతుఁడు. అతనికిఁ గల సేనాపరిమాణమునుబట్టి మహాసేనుఁ డనుపే రాతనికిఁ గలిగినది.

చేటి- రాజకుమారి యారాజుతోడి బంధుత్వము నిచ్ఛగించుట లేదు.

వాసవదత్త- మ తెవరితోడి పొందు నీమె కోరుచున్నది ?

చేటి- ఉదయనుఁ డని వత్సరాజు కలఁడు కదా! అతని గుణసంపద యీమెకు మెప్పు గూర్చినది.

వాసవదత్త- (ఆత్మగతము) ఆర్యపుత్రుని భర్తగాఁ గోరుచున్నది! (ప్రకాశముగా) ఎందుచేత ?

చేటి- దయాహృదయుఁ డని.

వాసవదత్త- (ఆత్మగతము) నిజము. నిజము. నేను గూడ నిట్లే యున్మాదము గొంటిని.

చేటి- రాజకుమారీ! యారాజట్టివాఁడు కానిచో?

వాసవదత్త-కాఁడు. ఎన్నటికిని గాఁడు. ఆయన దర్శనీయుఁడే.

పద్మావతి- అమ్మా! నీ కెట్లు తెలియును?

వాసవదత్త- (ఆత్మగతము) ఆర్యపుత్రునిమీఁది యభిమానముచే సముదాచారము నతిక్రమించితిని. ఇప్పు డేమి చేయఁగలను? కానిమ్ము. తెలిసినది. (ప్రకాశము) చెలీ! ఉజ్జయినీ నగరములోని జను లిట్లని చెప్పుకొందురు.

పద్మావతి- కావచ్చును. అతఁ డుజ్జయినీవాసులకు దుర్లభుఁడు కాఁ డనుట నిశ్చయము. సర్వజనమనోభిరామము గదా సౌభాగ్యము!

(అంత దాది ప్రవేశించును)

దాది- రాజకుమారికి జయము. రాజకుమారీ! నీవు దత్తవయితివి.

వాసవదత్త- అమ్మా! ఎవరికి?

దాది-వత్సరా జగునుదయనునకు.

వాసవదత్త- ఆరాజు కుశలముగా నున్నాఁడా?

దాది- కుశలముగనే యున్నాఁడు. ఆతఁ డిటకు వచ్చియు నున్నాఁడు. రాజకుమారి యాతని కొసఁగఁబడినది కూడ.

వాసవదత్త- దారుణము!

దాది- ఇందు దారుణ మే మున్నది?

వాసవదత్త- కొద్దిపాటిది కాదది. అట్లుగాఁ బత్నీవియోగమున సంతపించి యిప్పుడుదాసీనుఁ డయ్యెను గదా యని.

దాది- అమ్మా! మహాపురుషుల హృదయములాగమ ప్రధానములును, సులభపర్యవసన్నములును నగును గదా!

వాసవదత్త- అమ్మా! స్వయముగానే యాతఁ డీమెను వరించెనా?

దాది- లేదు. లేదు. ఏదో కార్యార్థ మాతఁ డిటకు విచ్చేసి యుండఁగా నాతని యభిజనమును, విజ్ఞానమును, వయస్సును, రూపమును జూచి మహారాజులుంగారే స్వయముగా నాతనికిఁ దనకొమారిత నొసఁగినారు!

వాసవదత్త- (ఆత్మగతము) అలాగా! అగుచో నార్యపుత్రునిలో దోషము లేదు.

(మఱొకతె ప్రవేశించును)

చేటి- అమ్మా! త్వరపడుఁడు. త్వరపడుఁడు. నేఁడే శుభదినమఁట! కౌతుకమంగళము నిప్పుడే నెఱవేర్పఁ దగు నని మహారాణులుంగారు చెప్పిరి.

వాసవదత్త- (ఆత్మగతము) వా రెంతగాఁ దొందర పడుచున్నారో యంతగా నా హృదయము చీఁకటిగొనుచున్నది.

దాది- రాజకుమారీ! రమ్ము. రమ్ము.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

# తృతీయాంకము

(అంత విచారముతో వాసవదత్త ప్రవేశించును)

వాసవదత్త- పెండ్లిసంబరముచే గగ్గోలుగా నున్నయంతః పురమునందలి చతుశ్శాలలోఁ బద్మావతిని వదలి నే నీప్రమదవనమునకు వచ్చితిని. (పరిక్రమించి) అహో! ఎంత దారుణము! ఆర్యపుత్రుఁడు కూడఁ బరకీయుఁ డయినాఁడు! కూర్చుందును. (కూర్చుండి) ప్రియు నెడబాసినంతనే జీవములు గోలుపోవుచక్రవాక వధువు ధన్యురాలు! నేనో ప్రాణముల వీడుట లేదు! ఆర్యపుత్రునిఁ జూడఁ గల్గుదు ననునాసచేతనే జీవించియుంటిని.

(అంతఁ బుష్పములు గ్రహించి చేటి ప్రవేశించును)

చేటి- అవంతికమ్మగా రెచ్చటకుఁ బోయిరో కదా! (పరిక్రమించి చూచి) అదిగో! చింతచే శూన్య మయిన హృదయము కలదై, మంచుచేఁ గప్పు వడిననెల వంకవలె, నలంకరించుకొనకున్నను మనోజ్ఞ మయిన వేషముతోఁ బ్రియంగువృక్షముక్రింది ఱాతితిన్నె పయిఁ గూర్చుండి యున్నది. (సమీపించి) అవంతికమ్మగారూ! ఎంతసే పని మిమ్ము వెదకుదును?

వాసవదత్త- ఎందులకు?

చేటి- మన మహారాణులుంగారు చెప్పిరి - వాసవదత్త దొడ్డ వంశమునఁ బుట్టినది, పద్మావతికిఁ గూర్చునది, నేర్పు

కలది - అని. అందుచే నమ్మగారికౌతుకమాలికను గూర్తురు గాక !.

వాసవదత్త- అయితే దీని నెవరికై కూర్పవలెను ?

చేటి- మన రాజకుమారికొఱకు.

వాసవదత్త- (ఆత్మగతము) ఇది కూడ నేను జేయవలసి వచ్చినది! అహో ! దేవతలు దయమాలినవారు గదా !

చేటి- అమ్మగారూ ! ఇపుడు మీరు వేఱేదియుఁ దలఁపవలదు. అల్లుఁడుగారిప్పుడే మణిసౌధమున స్నానము చేయుచున్నారు. మీరు శీఘ్రముగాఁ గూర్పవలెను.

వాసవదత్త- (ఆత్మగతము) ఇతరమును జింతింప నేరకున్నాను. (ప్రకాశముగా) చెలీ ! అల్లుఁడుగారిని జూచితివా ?

చేటి- ఆఁ. చూచితిని. రాజకుమారిమీఁది స్నేహము చేతను, కుతూహలము చేతను.

వాసవదత్త- అల్లుఁడుగా రెట్లున్నారు ?

చేటి- అమ్మా ! ఇంతమాత్రము చెప్పఁగలను. ఇట్టివాని నింతకు ముందు నేను జూచి యుండలేదు.

వాసవదత్త- చెలీ ! చెప్పుము. చెప్పుము. అందముగా నున్నాఁడా ?

చేటి- నిజముగా శరచాపములు లేని యా కామదేవుఁడే యనవచ్చును.

వాసవదత్త- ఇఁకఁ జాలింపుము.

చేటి- ఎందులకు వారించుచుంటిరి ?

వాసవదత్త- పరపురుషసంకీర్తనమును వినుట యుక్తము కాదు.

చేటి- అయితే అమ్మగారూ! మాలను త్వరగాఁ గూర్పుఁడు.

వాసవదత్త- తెమ్ము. (ఆత్మగతము) మందభాగ్యురాల నగు నేనే కూర్పవలసి వచ్చెనే! (పూవులు క్రిందఁ బోసి చూచి) ఈ యౌషధము పే రేమి ?

చేటి- అవిధవాకరణము.

వాసవదత్త- (ఆత్మగతము) నాకొఱకును, బద్మావతికొఱకును దీనిం గూర్పవలెను. (ప్రకాశముగా) మఱి యీ యౌషధము పే రేమి ?

చేటి- సపత్నీమర్దనము.

వాసవదత్త- అయిన దీనిఁ గూర్పరాదు.

చేటి- ఎందుచేత ?

వాసవదత్త- ఆయనభార్య చనిపోయినది. అందుచే నిది యవసరము లేదు.

(మఱొకతె ప్రవేశించి)

చేటి- అమ్మగారు! త్వరపడుఁడు. త్వరపడుఁడు. అల్లుఁడు గారిని ముత్తైదువ లభ్యంతరగృహములోని చతుశ్శాలకుఁ దీసికొని వచ్చుచున్నారు.

వాసవదత్త- ఇదిగో! దీనిఁ గైకొనుము.

చేటి- మంచిది. అమ్మగారూ! పోయి వత్తును. సెలవు.

(ఇరువురు నిష్క్రమింతురు)

వాసవదత్త- ఆమె వెడలిపోయినది. ఆహా! ఎంత దారుణము! ఆర్యపుత్రుఁడు కూడఁ బరకీయుఁడగుచున్నాఁడు! కానిమ్ము. నిద్దుర వచ్చునేని సెజ్జపై నా యీ దుఃఖమును గొంత పోఁగొట్టుకొందును గాక!

(నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము

(అంత విదూషకుఁడు ప్రవేశించును)

విదూషకుఁడు- (సహర్షముగా) ఓహో! అదృష్టవశమున నభిప్రేతమును, రమణీయమును నగు వత్సరాజ వివాహ మంగళమును దర్శింపఁ గలిగితిని. అట్టి యనర్థసలిలావర్తమునందుఁ బడిన మేము మరలఁ దేరుకొందు మని యెవ్వఁ డెఱుఁగును. ఇప్పుడో ప్రాసాదములందు నివసించుచుంటిని. అంతఃపురములోని దిగుడుబావులలో స్నాన మాడుచుంటిని. ప్రకృతిమధురములును, సుకుమారములును నగు మోదకఖాద్యములను దినుచుంటిని. ఈలాగున నే నచ్చరలు లేనియుత్తర కురుభూములయందలి వాసము ననుభవించుచుంటిని. కాని యొక్కటే పెద్ద లోపము. నా యాహారము తిన్నగా జీర్ణ మగుట లేదు. మెత్తగా దుప్పట్లు పఱుపఁబడిన సెజ్జపైఁ గూడ నిదుర వచ్చుట లేదు. శరీర మంతటను వాతము క్రమ్మినట్లు తోఁచుచున్నది. అజీర్ణముచే బాధపడుచు సకాలమున భుజింపఁజాలని వానికి నిజముగా సుఖము లేదు కదా!

(అంతఁ జేటి ప్రవేశించును)

చేటి- ఆర్యవసంతకుఁ డెచటికిఁ బోయి యుండును? (పరిక్రమించి చూచి) ఓహో! ఆర్యవసంతకుఁ డిచటనే

యున్నాఁడు. (సమీపించి) అయ్యా! ఎంతసే పని నిన్ను వెదకుదును?

విదూషకుఁడు- (చూచి) ఓసీ! నన్నెందులకు వెదకుచుంటివి?

చేటి- మన మహారాణిగా రడుగుచున్నారు — అల్లుఁడు గారి స్నాన మయినదా అని.

విదూషకుఁడు- ఆమె యెందుల కడుగుచున్నది?

చేటి- వే తే మున్నది? పూవులును, మైపూఁతలును దేవలయు నని.

విదూషకుఁడు- అయ్యగారి స్నాన మయినది. భోజనము తక్కఁ దక్కినసర్వము నీవు తేవచ్చును.

చేటి- భోజనము నెందులకు వల దనుచున్నావు?

విదూషకుఁడు- కోకిలగ్రుడ్లు తిరిగినట్లు దురదృష్టవంతుఁడ నయిన నాపొట్టలో నేదో గిరగిర మని తిరుగుచున్నది.

చేటి- ఎప్పుడు నిట్లే యుండుము.

విదూషకుఁడు- ఓసీ! పొమ్ము. నేనును నా మిత్రునిదగ్గఱకుఁ బోయెదను.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

(అంత సపరివార యై పద్మావతియు, నావంతికావేషమున వాసవదత్తయుఁ బ్రవేశింతురు)

చేటి- రాజకుమారి ప్రమదవనమునకు వచ్చుటకుఁ గారణ మేమి ?

పద్మావతి- చెలీ! ఆ శేఫాలికాగుల్మకములు పుష్పించెనో లేదో చూడఁ గోరి వచ్చితిని.

చేటి- రాజకుమారీ! అవి పుష్పించినట్లే. ప్రవాళాంతరితము లైనము త్తెపుసరులవలె నవి పుష్పములతో నిండి యున్నవి.

పద్మావతి- చెలీ! అయినచో నేల యాలసింతువు ?

చేటి- రాజకుమారి యీ రాతితిన్నెపయి క్షణకాలము కూరు చుండును గాక! ఇంతలో నేను పూవులు కోసికొని వత్తును.

పద్మావతి- అమ్మా! ఇచ్చటఁ గూర్చుందమా ?

వాసవదత్త- నీవు కోరినట్లే.

(ఇద్దఱుఁ గూర్చుందురు)

చేటి- (పూవులు కోసి తెచ్చి) రాజకుమారీ! చూడుము. చూడుము. అర్ధమనశ్శిలాపట్టకములవలె నున్న శేఫాలికాకుసుమములచేత నాదోసిలి నిండి యున్నది

పద్మావతి- (చూచి) ఆహా! ఈ పూవు లెంత విచిత్రముగా నున్నవి! అమ్మా! చూడుము. చూడుము.

వాసవదత్త- ఆహా! ఈ పూవు లెంత యందముగా నున్నవి!

చేటి- రాజకుమారీ! మఱికొన్ని కోసికొని వత్తునా ?

పద్మావతి- చెలీ! వలదు. వలదు. ఇంకఁ గోయవలదు.

వాసవదత్త- చెలీ! ఏల వారించుచున్నావు ?

పద్మావతి- ఆర్యపుత్రు లిచ్చటికి వచ్చి యీకుసుమసమృద్ధిని జూచి నన్ను సమ్మానింపవచ్చు నని.

వాసవదత్త- చెలీ! నీవు నీభర్త నంతగాఁ బ్రేమించుచుంటివా ?

పద్మావతి- అమ్మా! ఏమో నాకుఁ దెలియదు. కాని యార్యపుత్రుఁడు లేనిచోఁ గలఁత నొందుదును.

వాసవదత్త- (ఆత్మగతము) ఈమె కూడ నిట్లు తలఁచుచున్నదనఁగా నేను దుష్కర మయిన కార్యమును గదా చేయుచుంటిని !

చేటి- రాజకుమారి 'నేను నాభర్తను మిక్కిలిగాఁ బ్రేమింతు' నని చెప్పుట యెంతయు యుక్తముగా నున్నది.

పద్మావతి- నా కొక సందేహము.

వాసవదత్త- ఏమది ?

పద్మావతి- ఆర్యపుత్రుఁడు నా కెట్లు ప్రియుఁడో యట్లే వాసవదత్తకును బ్రియుఁ డై యుండెనా అని.

వాసవదత్త- ఇంతకంటె నధికముగనే !

పద్మావతి- నీ కెట్లు తెలియును ?

వాసవదత్త- (ఆత్మగతము) హా ! ఆర్యపుత్రునిమీఁది పక్షపాతముచేత సముదాచారము నతిక్రమించితిని. ఇట్లు

చెప్పుదును గాక! (ప్రకాశము) అల్పస్నేహమే యున్నచో నామె స్వజనమును విడనాడి యుండదు.

పద్మావతి- నిజమే.

చేటి- రాజకుమారీ! నేను గూడ వీణ నేర్చుకొందు నని యేలినవారిని మెల్లగా నడుగుము.

పద్మావతి- ఆర్యపుత్రుల నడిగితిని.

వాసవదత్త- ఆయన యే మనెను?

పద్మావతి- ఏమియుఁ జెప్పక నిట్టూర్పు పుచ్చి యూరకుండెను.

వాసవదత్త- దానిఁబట్టి నీ వేమి యనుకొంటివి?

పద్మావతి- ఆర్య వాసవదత్త గుణములను స్మరించి యాయన దాక్షిణ్యముచే నాయెదుట నేడువకుండె నని యనుకొంటిని.

వాసవదత్త- (ఆత్మగతము) ఇదియే సత్య మగుచో నేను ధన్యురాలను గదా!

(అంత రాజును, విదూషకుఁడును ప్రవేశింతురు)

విదూషకుఁడు- ఆహా! పూలు కోయునపుడు నేల జాఱిన బంధుజీవములమీఁదుగా నల్లనల్లన వీచుచున్నపిల్ల వాయువులచే నీప్రమదవన మెంత రమణీయముగా నున్నది! ఆర్యా! ఇటు, ఇటు.

రాజు- వయస్యా! వసంతక! ఇదిగో వచ్చుచున్నాను.

చ॥ మఱువున నుండి యుజ్జయిని
మానిని వాసవదత్తఁ జూచి నే

నెఱుఁగఁగరాని బాధఁ గన
నేసెను మన్మథుఁ డైదుబాణముల్,
కర మలయింపఁగా నెడఁద
గాడఁగఁ జేసెడు నిప్డు కూడ, నా
స్మరుఁ డిలఁ బంచబాణుఁ
డఁట, షష్ఠశరం బది యెట్టిదో కదా!

విదూ— పద్మావతమ్మగా రిచ్చటికిఁ బోయి యుందురో కదా! లతామండపమునకుఁ బోయి యుండునా? లేక యంతట వెదఁజల్లఁబడిన యసనకుసుమములచేఁ బులితోలుచేఁ గప్పఁబడిన ట్లున్న 'పర్వతతిలక' మను చలువరాతితిన్నెకడకుఁ బోయి యుండునా? లేక గాఢమైనవాసన గలసప్తచ్ఛదవనమును బ్రవేశించెనా యేమి? లేక మృగములును, బక్షులును జిత్రింపఁబడి యున్నదారుపర్వతమునకుఁ బోయి యుండునా? (ఊర్ధ్వ మవలోకించి) హా! హా! మహారాజా! శరత్కాల మగుట నిర్మల మయినయంతరిక్షమునందుఁ జనుచున్నసారసపంక్తిని - బ్రసన్నుఁ డగుబలదేవుని బాహువులవలె దర్శనీయ మగుదానిని జూడుము.

రాజు— వయస్యా! చూచుచుంటిని.

ఉ॥ తిన్నగ దీర్ఘమై విరళదృ
శ్యము నై నతమై యొకొక్కచో
నున్నత మౌచు మల్పులను
నొప్పుచు సప్తమహర్షిమండలా

భ్యున్నతి వక్రమై భుజగ
మూడ్చెడునాకుబుసంబుపోలికం
జెన్నుదలిర్చి యాకసముఁ
జీల్చెడునట్టులఁ బోవుదానినిన్.

చేటి- రాజకుమారీ! చూడుము. చూడుము. తామరపూల మాలవలెఁ దెల్లగాను, నందముగాను నుండి యెక్కువ వేగముతో ముందునకుఁ బోవుచున్న బెగ్గురుపక్షుల బారును జూడుము. అహో! ప్రభువులు!

పద్మావతి- అగును. ఆర్యపుత్రుఁడు! అమ్మా! నీకొఱకై యార్యపుత్రుల దర్శనమును బరిహరించుచుంటిని. అందుకై మన మీ మాధవీలతామండపమును బ్రవేశింతము గాక!

వాసవదత్త- సరియే!

(అట్లు చేయుదురు)

విదూషకుఁడు- పద్మావతమ్మగారిచ్చటకు వచ్చి పోయియుందురు.

రాజు- నీ కెట్లు తెలియును?

విదూషకుఁడు- శేఫాలికాగుచ్ఛములనుండి కోయఁబడిన యీ పూవులను జూడుము.

రాజు- వసంతకా! ఈపూవు లెంత విచిత్రముగా నున్నవి!

వాసవదత్త- (ఆత్మగతము) వసంతకుని పలుకు విని తిరిగి యుజ్జయినియం దున్నట్లు తలపోయుచున్నాను.

రాజు– వసంతకా! ఈ శిలాతలమునఁ గూర్చుండి పద్మావతి
కొఱ కెదురు చూతము.

విదూ– ఆర్యా! అట్లే. (కూర్చుండి మరల లేచి) హా! హా!
శరత్కాలమునందలి యీ యెండ మిక్కిలి దుస్సహ
ముగా నున్నది. అందుచే నీమాధవీలతామండప
మును బ్రవేశింతము.

రాజు– సరియే! ముందు నడువుము.

విదూషకుఁడు– చిత్తము.

(ఇద్దఱు నడతురు)

పద్మావతి– ఆర్యవసంతకుఁడు సర్వమును జెఱచున ట్లున్నది.
ఇప్పు డేమి చేయుదము?

చేటి– రాజకుమారీ! తుమ్మెదలు మూఁగి వ్రేలాడుచున్న
యీతీవను గదలించి ప్రభువులను వారింతును.

పద్మావతి– అట్లే చేయుము.

(చేటి యట్లు చేయును)

విదూషకుఁడు– రక్షింపుము. రక్షింపుము. మహారాజా!
రావలదు. అచటనే నిలువుము.

రాజు– ఏల?

విదూషకుఁడు– ఈతుమ్మెదతొత్తులచే బాధింపఁబడుచుంటిని.

రాజు– వలదు. అట్లనవలదు. మధుకరసంత్రాసము మంచిది
కాదు. చూడుము.

గీ. మధుమదంబునఁ గ్రై పెక్కు మధుకరములు
మదనవశ లగుసతులతో మలయుచుండె

నడుగుసవ్వడి విని దూర మెడలునెడలఁ
జెలుల యెడఁబాటు మనవలె నళుల కగును.

కావున నిక్కడనే కూర్చుందము.

విదూ- అట్లే చేయుదము.

(ఇరువురును గూర్చుందురు)

చేటి- రాజకుమారీ! మనము చెఱలో నుంటిమి గదా!

పద్మావతి- అదృష్టవశమున నార్యపుత్రుఁడు కూర్చున్నాఁడు.

వాసవదత్త-(ఆత్మగతము) అదృష్టవశమున నార్యపుత్రుఁడు సుఖముగానే యున్నాఁడు.

చేటి- రాజకుమారీ! ఈ యార్యారాలు కన్నీరు కార్చుచున్నది!

వాసవదత్త- తుమ్మెదలదుండగముచే రెల్లుపూల పుప్పొడి పడి నాకంటినుండి నీరు కారుచున్నది.

పద్మావతి- కావచ్చును.

విదూషకుఁడు- ఆర్యా! ఈప్రమదవనమున నెవ్వరును లేరు. నే నొకటి యడుగఁ దలఁతును. అడుగుదునా?

రాజు- నిర్భయముగా నడుగుము.

విదూషకుఁడు- నీకు మిక్కిలిగాఁ గూర్చువా రెవరు? మునుపటి యార్యవాసవదత్తయా? ఇప్పటి పద్మావతియా?

రాజు- ఏల నీ విపుడు నన్నుఁ బెద్ద చిక్కులోఁ బడవైతువు?

పద్మావతి- చెలీ! ఆర్యపుత్రుల చిక్కెట్టిది?

వాసవదత్త- (ఆత్మగతము) నేను గూడ మందభాగ్యురాలను.

విదూషకుఁడు- ఆర్యా! మనసు విచ్చి స్పష్టముగాఁ జెప్పుము.
ఒకతె చనిపోయినది. మఱొకతె దగ్గఱ లేదు.

రాజు- వయస్యా! చెప్పను. నేను జెప్పను. నీవు వదరుఁబోతవు.

పద్మావతి- ఆర్యపుత్రుల యీవచనము చాలును.

విదూషకుఁడు- ఆర్యా! నామీఁద నొట్టు పెట్టుచున్నాను. ఎవ్వరికిని జెప్పను. ఈ నాలుకను గట్టి వైచితిని.

రాజు- మిత్రమా! చెప్పుటకు నోరు రాకున్నది.

పద్మావతి- ఆహా! ఏమి యీతని మూర్ఖత్వము! ఇప్పటికిని నాయన హృదయమును దెలిసికొనఁ జాలకున్నాఁడు.

విదూషకుఁడు- అయినఁ జెప్పవా? చెప్పకుండ నీశిలాపట్టకముమీఁదినుండి యొక్కయడుగు కూడ ముందునకు సాఁగుటకు వీలులేదు. నీవు నాచెఱలో నుంటివి.

రాజు- అయిన బలాత్కారము చేయుదువా?

విదూషకుఁడు- అవును. బలాత్కారమే చేయుదును.

రాజు- అయినఁ జూచెదము గాక!

విదూషకుఁడు- అయ్యా! అనుగ్రహింపుము. అనుగ్రహింపుము. నిజము చెప్పవేమో యని స్నేహభావముచేత నట్లంటిని.

రాజు- ఏమి చేయుదును? చెప్పక తప్పదు. వినుము.

క. అందచందములను, శీలమందు నెందుఁ
గొఱఁత లేక పద్మావతి కూర్చు నాకుఁ

గాని వాసవదత్తపైఁ గ్రందుకొన్న
మన మ దేలకో యావైపు మరలకుండు.

వాసవదత్త- (ఆత్మగతము) బాగు! బాగు! ఈపరిఖేదము నకుఁ దగినబహుమానము దొరకినది. ఆహా! ఇక్కడి యీయజ్ఞాతవాసము కూడ మంచికే యయినది.

చేటి- రాజకుమారీ! ఏలినవారు దాక్షిణ్యము లేనివారు సుమా!

పద్మావతి- చెలీ! అట్లనకుము. ఆర్యపుత్రులు దాక్షిణ్యము కలవారే యగుదురు. ఏలన నిప్పుడు కూడఁ బూజ్యురా లగువాసవదత్త గుణములను స్మరించుచున్నారు!

వాసవదత్త- తల్లీ! నీగౌరవమునకుఁ దగిన ట్లున్నవి నీవచనములు.

రాజు- నేను జెప్పు టయినది. ఇపుడు నీవంతు వచ్చినది. నీ కిష్టురా లెవతె? మునుపటి వాసవదత్తయా? ఇప్పటి పద్మావతియా?

పద్మావతి- ఆర్యపుత్రుఁడు కూడ వసంతకుఁ డయ్యెను!

విదూషకుఁడు- నా నిరుపయోగప్రసంగమువలన నేమి లాభము? నాకుఁ బూజ్యురాం డ్రిరువురును బహుమానపాత్రలే యగుదురు.

రాజు- దుర్మార్గుఁడా! బలవంతముగా నాచేత నట్లు చెప్పించుకొని యిప్పుడు నీవు దాఁచుచున్నావా?

విదూషకుఁడు- ఏమి! నాకును బలాత్కారమేనా?

రాజు- బలాత్కారము గాక మఱేమి!

విదూషకుఁడు- అయిన నీవు వినఁజాలవు.

రాజు- మహాబ్రాహ్మణుఁడా! అనుగ్రహింపుము. అనుగ్రహింపుము. స్వచ్ఛందముగా మనసు విచ్చి చెప్పుము.

విదూషకుఁడు- ఆర్యా! ఇప్పుడు వినుము. పూజ్యురాలు వాసవదత్తయెడ నాకు గౌరవ మధికము. పూజ్యురాలు పద్మావతి తరుణి, అందగత్తె, కోపము లేనిది, అహంకారము లేనిది, తీయగా మాటలాడునది, దాక్షిణ్యముతోఁ గూడినది. కాని వాసవదత్తయెడ నొక గొప్పగుణ మున్నది. 'ఆర్యవసంతకుఁ డెచ్చటికిఁ బోయినాఁడో కదా' యని యామె మంచిభోజనముతో నా కెదురు వచ్చుచుండినది.

వాసవదత్త- (ఆత్మగతము) బాగు! బాగు! వసంతకా! ఇంకను నీ కది జ్ఞాపక మున్నదా?

రాజు- మంచిది. వసంతకా! ఇది యంతయు దేవి వాసవదత్తకుఁ జెప్పుదును.

విదూషకుఁడు- అయ్యో! వాసవదత్త! వాసవదత్త యెక్కడ! చిరకాలముక్రిందనే చనిపోయినదిగదా వాసవదత్త!

రాజు- (సవిషాదముగా) అవును. వాసవదత్త చనిపోయినది.

గీ. సఖుఁడ! యారీతిఁ బరిహాసజల్పితమున
నామనోవీథిఁ గట్టితి నే మనంగఁ
దలఁపునరదాల వలపుమై మెలఁగ వదన
మునను వెలువడె నభ్యాసమునను వాణి.

పద్మావతి- రమణీయ మయినయీసంభాషణము నీమూర్ఖుఁడు పాడు చేసినాఁడు గదా!

వాసవదత్త-(ఆత్మగతము) మంచిది. నాకుఁ గొంత యూఱట గలినది. ఆహా! పరోక్షమున నిట్టిమాటను వినుట మిక్కిలి ప్రియము గదా!

విదూషకుఁడు- ఆర్యా! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము. విధి యనతిక్రమణీయము గదా! ఇదియు నట్టిదే!

రాజు- వయస్యా! నాయవస్థను నీ వరయకున్నావు. ఎందుచేత ననఁగా-

ఉ. శోకము వీడ నెంతు, నల
సుందరిరూపు స్మరించినంత నే
వాకొనరానిశోకము నవత్వము
నొందుఁ దదీయప్రేమచే,
లోకములోన నైజ మిది
లోలతఁ గాంత్రు మనఃప్రసాదముం
బ్రాకటరీతి బాష్పముల
రాల్చుట నీగి ఋణంబుఁ బ్రేమికుల్.

విదూషకుఁడు- ఆర్యా! నీముఖము కన్నీటిచేఁ దడిసియున్నది. మొగము కడుగుకొనుటకు నీరు తెత్తును.
(నిష్క్రమించును)

పద్మావతి- అమ్మా! ఆర్యపుత్రుల మొగమును గన్నీటిపొర గ్రమ్మి యున్నది. ఇటనుండి పోవుదము రమ్మ.

వాసవదత్త- అట్లే చేయుదము. వద్దు. వద్దు - నీ విచ్చటనే యుండుము. ఉత్కంఠితుఁ డయినభర్తను వీడి చనుట యుక్తము కాదు కదా! నేనే పోవుదును.

చేటి- అమ్మగారు చెప్పినది చాల బాగుగా నున్నది. రాజకుమారి యేలినవారిని సమీపించును గాక!

పద్మావతి- పోవుదునా?

వాసవదత్త- చెలీ! పొమ్ము.

(అని చెప్పి నిష్క్రమించును)

(ప్రవేశించి)

విదూషకుఁడు- (తామరాకులో నీటిని గ్రహించి) ఓ! పూజ్యురాలు పద్మావతమ్మగారు!

పద్మావతి- ఆర్య! వసంతక! యే మిది?

విదూషకుఁడు- ఇది యది. అది యిది.

పద్మావతి- చెప్పుము. చెప్పుము. ఆర్యా! చెప్పుము.

విదూషకుఁడు- అమ్మా! గాలిపాటున రెల్లుపూల పుప్పొడి కంటిలోఁ బడుటచే నార్యుని మొగము కన్నీటిచే నిండి యున్నది. అందుచే అమ్మగారు మొగము కడుగుట కీజలమును గొని పొండు.

పద్మావతి- (ఆత్మగతము) దాక్షిణ్యము గలవారి పరిజనము కూడ దాక్షిణ్యము గలదిగానే యుండును. (రాజు కడకుఁ బోయి) ఆర్యపుత్రులకు జయము! మొగము కడుగుకొనుటకు నీ రిదిగో గైకొనుఁడు.

రాజు- ఆ! పద్మావతి! (అపవారించి) వసంతకా! యే మిది!

విదూషకుఁడు- (చెవిలో) ఇది యిట్లు.

రాజు- బాగు. వసంతకా! బాగు. (ఆచమించి) పద్మావతీ!
కూర్చుండుము.

పద్మావతి- ఆర్యపుత్రుల సెలవుప్రకారము. (కూర్చుండును)

రాజు- పద్మావతీ!

క. శరదిందుకలాగౌరము
మరుదానీతంబు కాశమంజరిలవ మో
సరసిజదళాక్షి! కన్నుల
వరలుట నాముఖము సాశ్రుపాతం బయ్యెన్.

(ఆత్మగతము)

గీ. బాల యీసాధ్వి యభినవోద్వాహ సత్య
వృత్త మెఱిఁగినచోఁ గడు వెతను గాంచు
ధీరురా లీమె; యయినను స్త్రీస్వభావ
మరసి చూడఁగఁ గాతరం బగును గాదె.

విదూషకుఁడు- పూజనీయు లయినమగధమహారాజులుంగా
రీ మధ్యాహ్నము నీతోఁ గూడ సుహృజ్జనదర్శనముఁ
జేయఁ దలంచుట యెంతయు నుచితముగా నున్నది.
సత్కారముచేతఁ బ్రతీష్ట మయిన సత్కారము ప్రీతి
నుత్పాదింపఁగలదు. కనుక నార్యు డిఁక లేచి
రావలయును.

రాజు- చక్కని యాలోచన యిది. (లేచి)

గీ. మేలిగొనములు గలిగి విశాలహృదయు
అగుచు సత్కార్యములఁ జేయునట్టివారు
సులభు లగుదురు గాని యాలలితగుణుల
సుకృతముల నెంచువా రుండ రకట! యెందు.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

## పంచమాంకము

(అంతఁ బద్మినిక ప్రవేశించును)

పద్మినిక- మధుకరికా! మధుకరికా! రమ్ము. త్వరగా రమ్ము.

మధుకరిక- (ప్రవేశించి) చెలీ! యిదిగో యిక్కడ నున్నాను. ఏమి పని?

పద్మినిక- చెలీ! రాజకుమారి పద్మావతమ్మగారు తలనొప్పితో బాధపడుచున్న దని యెఱుఁగవా?

మధుకరిక- అయ్యో! పాపము!

పద్మినిక- చెలీ! త్వరగాఁ బొమ్ము. ఆర్యురాలిని ఆవంతికమ్మగారిని బిలువుము. రాజకుమారికిఁ దలనొప్పిగా నున్న దని మాత్ర మామెతోఁ జెప్పుము. ఆమె స్వయముగానే రాఁగలదు.

మధుకరిక- చెలీ! ఆమె యేమి చేయఁగలదు?

పద్మినిక- ఆమె యేవైన మంచికథలు చెప్పి యిపుడు రాజకుమారి తలనొప్పిని బోఁగొట్టఁగలదు.

మధుకరిక- సరియే! అయితే రాజకుమారికిఁ బడక నెచట సిద్ధము చేసినారు?

పద్మినిక- సముద్రగృహమునందు శయ్య సిద్ధము చేయఁబడినది. ఇపుడు నీవు పొమ్ము. నేనును నుదయన ప్రభువులకుఁ దెలుపుటకై వసంతకుని వెదకుదును.

మధుకరిక- అట్లే చేయుము. (నిష్క్రమించును).

పద్మినిక- ఆర్యవసంతకు నిప్పు డెక్కడఁ జూడఁగలను ?

(అంత విదూషకుఁడు ప్రవేశించును)

విదూషకుఁడు- దేవీవియోగముచే హృదయము చెదరిన మహారాజు ఉదయనుని మదనాగ్నిదాహము పద్మావతీపాణిగ్రహణ మనుసమీరముచే రెచ్చఁగొట్టఁబడిన దై యత్యంతసుఖావహ మైనయీమంగళోత్సవమునందు మిక్కిలిగా జ్వలించుచున్నది. (పద్మినికను విలోకించి) ఓసి! పద్మినికా! పద్మినికా! ఏమి విశేషము ?

పద్మినిక- వసంతకా! నీకుఁ దెలియదా యేమి? రాజకుమారి పద్మావతి తలనొప్పితో బాధపడుచున్నది.

విదూషకుఁడు- అమ్మో! నిజముగా నాకుఁ దెలియదు.

పద్మినిక- అయిన నీ విషయమును మీ మహారాజుగారికిఁ దెలుపుము. ఇంతలో నేను బోయి తలనొప్పిమందు తెత్తును.

విదూషకుఁడు- పద్మావతమ్మగారికిఁ బడక యెచట సిద్ధము చేయఁబడినది ?

పద్మినిక- సముద్రగృహమునందు శయ్య సిద్ధము చేసినారు.

విదూషకుఁడు- అమ్మా! పొమ్ము. ఇంతలో నేనును మహారాజుగారి కీవిషయము తెలుపుదును.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

(అంత రాజు ప్రవేశించును)

రాజు-

చ. మగుడ వివాహమందు నొక
మానినిఁ బొందియు నేఁ దలంతు శ్లా
ఘ్యగుణను నాయవంతిపతి కన్న
కుమారిత వీణిహాస్త్రము చే
నగణితలీల లావణకమందున
దగ్ధయు నైన దేవినిఁ
నెగడెడుమంచునం జదియు
నీరజవల్లిని బోలుదానిఁ గా.

విదూ- ఆర్యా! త్వరపడుము. త్వరపడుము.

రాజు- ఏల?

విదూషకుఁడు- పూజ్యురాలు పద్మావతమ్మగారు తలనొప్పితో
బాధపడుచున్నారు.

రాజు- ఎవరు చెప్పిరి?

విదూషకుఁడు- పద్మినిక చెప్పినది.

రాజు- అహో! కష్టము.

గీ. అందములప్రోవు గుణరాశి యనఁగ నొప్పు
ప్రేయసిం బొందుటం గొంత వెత యడంగెఁ
గాని మును దెబ్బ తిని యున్న కారణమున
జరుగు నే మొకొ యట్లని శంక సేతు.
అయినఁ బద్మావతి యెచ్చట నున్నది?

విదూషకుఁడు— సముద్రగృహమునందుఁ బడక సిద్ధము చేయఁ
బడినది.

రాజు— అయిన నచ్చటికిఁ ద్రోవ చూపుము.

విదూషకుఁడు— ఆర్యా! ఇటు రమ్ము. ఇటు రమ్ము.
(ఇరువురు పరిక్రమింతురు)

విదూషకుఁడు— ఇదిగో సముద్రగృహము. ఇందుఁ బ్రవే
శింపుము.

రాజు— ముందు నీవే ప్రవేశింపుము.

విదూషకుఁడు— ఆర్యా! అట్లే. (ప్రవేశించి) అయ్యో!
అయ్యో! ఆర్యా! అట్లే నిలువుము. నిలువుము.

రాజు— ఎందులకు?

విదూషకుఁడు— ఇదిగో! ఈ నేలమీఁద దీపపువెలుఁగులోఁ
గనఁబడుచు నొక నాగుపాము ప్రాకుచున్నది.

రాజు— (ప్రవేశించి చూచి నవ్వుచు) ఆహా! మూర్ఖుఁడు సర్ప
మని భ్రాంతి పడినాఁడు!

ఉ. తిన్నఁగ దీర్ఘమై పొలిచి
తేఁకువ దప్పినద్వారతోరణో
ద్భిన్నతఁ గాంచి నేలపయిఁ
బేర్మి నెలర్చెడుపుష్పహారముం
బన్నగ మంచు నెంచితివి
మందుఁడ! యయ్యది మందమారుతం
బన్నువ వీవ రేయి నిటు
లాడుచు నున్నది పాముపోలికన్.

విదూషకుఁడు- (నిరూపించి) ఆర్యా! బాగుగాఁ జెప్పితివి. ఇది నాగుపాము కాదు. (ప్రవేశించి చూచి) పూజ్యురాలు పద్మావతమ్మగారిక్కడకు వచ్చి పోయి యుండును.

రాజు- వయస్యా! ఇక్కడకు వచ్చియుండ దనియే తోఁచుచున్నది.

విదూషకుఁడు- ఎట్లు తెలియును?

రాజు- తెలియవలసిన దేమున్నది? చూడుము.

చ. నలఁగ దొకింత సెజ్జ యిది,
నాడెము దప్పదు దుప్పటంబునుం,
దల నిడు నౌషధంబులకతం
బున స్వచ్ఛశిరోపధానముం
బొలియదు, రోగి కక్కవలచు
పొంకమ దేదియుఁ గానరాదు, భూ
తలమున వీడ దింతట నె
తల్పముఁ బట్టిన ప్రాణి తానుగా.

విదూషకుఁడు- అయిన నీ సెజ్జపై ముహూర్తకాలము కూర్చుండి పూజ్యురాలు పద్మావతమ్మగారికోస మెదురు చూచుచుందము.

రాజు- బాగున్నది. (కూర్చుండి) వయస్యా! నిదుర వచ్చుచున్నది! ఏదైన నొక కథ చెప్పుము.

విదూషకుఁడు- ఆర్యా! నేను కథ చెప్పుచుందును. నీవు ఊఁ కొట్టుచుండుము.

రాజు- అట్లే.

విదూషకుఁడు- అనఁగా అనఁగా ఉజ్జయిని యని యొక నగరము కలదు. అందు మిక్కిలి రమణీయము లయినజలాశయము లున్నవి.

రాజు- ఉజ్జయినియా ?

విదూషకుఁడు- ఈ కథ బాగుగా లేకున్నయెడల నింకొక కథను జెప్పెదను.

రాజు- వయస్యా! ఈ కథ బాగు లేక కాదు సుమా! మఱి యే మనఁగా—

క. తనవారిం దలపోయఁగఁ
గనుఁగోనలయందు నిలుచుకన్నీటను మ
ఘ్నవతీముఁ దడుపుచు నె
మ్మిని బ్రస్థానమున నిలుచుమెలఁతఁ దలంతున్.

మఱియు,

క. ఉపదేశావసరములను
జపలాక్షి తదేకదృష్టి సారెకు నన్నే
యుపలక్షించుచు వీణా
వ్యపనయమున గాలి మీటుఁ బరవశమతి యై.

విదూషకుఁడు- కానిమ్ము. ఇంకొక కథ చెప్పెదను. అనఁగా అనఁగా బ్రహ్మదత్త మని యొకనగరము కలదు. అందు కాంపిల్యుఁ డనురా జుండెను.

రాజు- ఎట్లెట్లు ?

విదూషకుఁడు- (తిరిగి యట్లే చెప్పును)

రాజు- మూర్ఖుఁడా! బ్రహ్మదత్తుఁడు రాజు. కాంపిల్యము నగరము.

విదూషకుఁడు- ఏమి! బ్రహ్మదత్తుఁడు రాజు, కాంపిల్యము నగరమునా?

రాజు- అవు నట్లే.

విదూషకుఁడు- అయినచో రాజా! యొక ముహూర్తకాల మాగుము. ఇంతలో దానిని గంఠస్థము చేయుదును. బ్రహ్మదత్తుఁడు రాజు. కాంపిల్యము నగరము. (అని పలుమాఱులు దానినే పఠించి) ఆర్యా! యిఁక వినుము. ఆఁ! ఈతఁడు నిదుర పోయినాఁడు. మిక్కిలి చలిగా నున్నది. నా దుప్పటిని తెచ్చుకొని వచ్చెదను.

(నిష్క్రమించును)

(అంత నావంతికా వేషముతో వాసవదత్తయు - చేటియుఁ బ్రవేశింతురు)

చేటి- అమ్మా! రమ్ము, రమ్ము. రాజకుమారి తలనొప్పితో మిక్కిలి బాధపడుచున్నది.

వాసవదత్త- పాపము! పద్మావతమ్మగారికిఁ బడక యెచ్చట సిద్ధము చేయఁబడి యున్నది.

చేటి- సముద్రగృహమునందుఁ బడక సిద్ధము చేయఁబడినది

వాసవదత్త- అయితే నీవు ముందు నడువుము.

(ఇరువురు పరిక్రమింతురు)

చేటి- ఇదిగో సముద్రగృహము. అమ్మా! ప్రవేశింపుము. ఇంతలో నేను బోయి తలనొప్పిమందు తీసికొని వచ్చెదను.

(నిష్క్రమించును)

వాసవదత్త- అకటా! దేవతలు నాయెడ దయమాలి యున్నారు గదా! విరహపర్యుత్సుకుఁడగు నార్యపుత్రునికి వినోదహేతు వగునీ పద్మావతి కూడ నస్వస్థురాలుగా నున్నది. లోనికిఁ బోవుదును. (ప్రవేశించి చూచి) అహో! పరిజనముయొక్క ప్రమాద మేమి చెప్పుదును? అస్వస్థురా లయినపద్మావతిని దీపమాత్ర సహాయనుగాఁ జేసి యెచ్చటికో పోయి యున్నారు. ఈ పద్మావతియో నిదురించి యున్నది. కూర్చుందును. వేఱొకయైన నాసనముపైఁ గూర్చుండినయెడలఁ బద్మావతియెడ నాకుఁ గలస్నేహ మల్ప మయినదిగాఁ దోఁచును. అందుచే నీసెజ్జపైనే కూర్చుందును. (కూర్చుండి) ఏమిది? ఈయమప్రక్కఁ గూర్చుండుటచే నేలొకో నాహృదయము సంతోషముచేఁ బొంగిపోవుచున్నది. అదృష్టవశమున నీమె యవిచ్ఛిన్నముగాను, సుఖముగాను నిశ్వసించుచున్నది. కనుక నీమె జబ్బు నయ మయి యుండును. శయనీయముపై నొక ప్రక్క కొఱఁగి పరుండి యుండుటచే నీమె నన్నుఁ

గౌఁగిలించుకొను మని సూచించున ట్లున్నది. పరుం డుదును గాక! (పరుండుట నభినయించును)

రాజు- (కలవరించును) హా! వాసవదత్తా!

వాసవదత్త- (త్రొట్రుపాటుతో లేచి) ఆఁ! ఆర్యపుత్రుఁడు! పద్మావతి కాదు. ఆయన నన్నుఁ జూచియుండునా యేమి? ఆర్య యౌగంధరాయణుని మహాప్రతిజ్ఞా భారము నాదర్శనముచే నిష్ఫల మయినది కదా!

రాజు- హా! అవంతిరాజపుత్రీ!

వాసవదత్త- ఆర్యపుత్రుఁడు కలవరించుచున్నాఁడు. ఇది నా యదృష్టము. ఇచ్చట నెవ్వరును లేరు. ముహూర్త కాల మిట నుండి కన్నులను, హృదయమును సంతోష పెట్టుదును.

రాజు- హా! ప్రియా! హా! ప్రియశిష్యా! బదులు చెప్పుము.

వాసవదత్త- మాటాడుచున్నాను. ప్రభూ! మాటాడు చున్నాను.

రాజు- ఏమి! కోపము వచ్చినదా?

వాసవదత్త- లేదు. లేదు. దుఃఖించుచున్నాను.

రాజు- కోపము లేకున్నయెడల నెందుల కలంకరించుకొన లేదు?

వాసవదత్త- ఇంతకంటె గొప్పకారణము కావలెనా!

రాజు- విరహికను స్మరించుచుంటివా యేమి?

వాసవదత్త- (సరోషముగా) ఆఁ! ఇక్కడఁ గూడ విర హికయా?

రాజు- అయితే విరహిక యని పేర్కొన్నందుకై నన్ను క్షమింపు మని నిన్ను వేఁడుచున్నాను.

(చేతులు చాచును)

వాసవదత్త- ఇచ్చటకు వచ్చి చాలసేపయినది. ఎవరైన నన్నుఁ జూడఁగలరు. కనుకఁ బోవుదును...కాదు. సెజ్జమీఁదినుండి క్రిందికి వ్రేలాడుచున్నయార్యపుత్రుని హస్తమును సెజ్జపైఁ జేర్చి పోవుదును.

(అట్లు చేసి నిష్క్రమించును)

రాజు- (వేగముగా లేచి) వాసవదత్తా! ఉండు ముండుము. అయ్యో!

గీ. సతిని బట్టంగ నేఁ జనుసంభ్రమమున
ద్వారబంధంబు నాతలఁ దగులుకతన
నా మనోరథరూప మీ నాతి నిజమొ
స్వప్నమో గాంచ నయ్యెద వ్యక్తముగను.

విదూషకుఁడు-(ప్రవేశించి) అరే! యీయన మేలుకొన్నాఁడు!

రాజు- వయస్యా! ప్రియవచనము నివేదింతును. వాసవదత్త జీవించి యున్నది.

విదూషకుఁడు- అయ్యో! వాసవదత్త! వాసవదత్త యెక్కడిది! వాసవదత్త చనిపోయి చాలకాల మయినది.

రాజు- వయస్యా! అట్లన వలదు. అట్లన వలదు.

గీ. పడుకమీఁదను నిదురించుపతిని నన్ను
మేలుకొలిపియు నెటకొ తా మెలుఁత జాఱె

నగ్నిలోఁ బడి మరణించె ననుచుఁ దెలిపి
నన్ను వంచించె మును రుమణ్వాంతమంత్రి.

విదూ- అయ్యో! యిది యసంభవము కాదు. ఉజ్జయినిలోని యుదకస్నానములనుగూర్చి నేను జెప్పఁగా నా పూజ్యురాలినే ధ్యానించుచుండి నీ వామెను స్వప్నమునఁ గాంచి యుందువు.

రాజు- అయిన నే నామెను స్వప్నమునను చూచితిని!

క. అది స్వప్నమె యయ్యెడుచో
నిదురయె తా ధన్య మగు ననిందితలీలన్
అది విభ్రమ మగుచో న
య్యదియే బహుకాల ముండి యలరించుత నన్.

విదూ- ఆర్యా! మిమ్ములను మీరే యిప్పుడి ట్లుపహసించుకొనుట తగదు. ఏల యన — ఈ రాజకులమునం దవంతిసుందరి యనుయక్షిణి యొకతె నివసించుచున్నది ఆమెనే నీవు చూచి యుందువు.

రాజు- లేదు. లేదు.

గీ. స్వప్నముననుండి మేల్కాంచి చక్కఁ గంటిఁ
గనులఁ గాటుక యిడక దీర్ఘంబు లైన
నెఱులఁ దైలంబుఁ బూయక నిష్ఠఁ దనదు
శీలరక్షణగతిఁ బొల్చు చెలువ మొగము.

మఱియు వయస్యా! చూడుము. చూడుము.

క. బెదరుచు బెదరుచునే సతి
చదు రేర్పడఁ బట్ట నద్ది స్వప్నమె యయినం
గదిరెదుపుల కావలిఁ దా
వదలక చెన్నొందునాదు బాహువుఁ గనుమా !

విదూ- ఆర్యా ! ఇప్పు డి ట్లనర్థమును జింతించుట భావ్యము కాదు. రమ్ము. రమ్ము. చతుశ్శాలకుఁ బోవుదము.

కాంచుకీయుఁడు- (ప్రవేశించి) ఆర్యపుత్రులకు జయము ! మా మహారాజులుంగారు దర్శకులవారు తమ కిట్లు తెలుపు చున్నారు—'ఇదుగో తమ యమాత్యు లగురుమ ణ్వంతులవారు గొప్పబలసముదాయముతో నారుణి నెదుర్కొనుటకై వచ్చి యున్నారు. అట్లే నా సైన్యము లోని హస్త్యశ్వరథపదాతులును విజయాంగము లతో సిద్ధముగా నున్నవి. అందుచే నార్యా ! లెమ్ము. మఱియు—

సీ. శత్రురాజన్యులు మైత్రిఁ గూడనియట్లు
భేదంబు చక్కఁ గల్పింపఁబడియె
భవదీయగుణములం బలుమాఱు స్మరియించు
పౌరాళి యూఱడింపంగఁ బడియె
యుద్ధభూమికి సేన యుద్ధతిం జనువేళఁ
బార్ష్ణిరక్షణము గల్పింగఁ బడియె
శత్రువినాశంబు సాధింప నే మేమి
శక్య మా నది యెల్ల గల్పఁ బడియె

గీ. నరుల భంజింప మేము చేయనిది లేదు
దళపతుల్ సాఁగి యాఁగంగ దాఁటి చనిరి
శంక యేలయ్య నీకు హస్తగతంబ
'వత్స' మని నమ్ము బలము చూపంగ రమ్ము.

రాజు- (లేచి) మంచిది. ఇప్పుడే

క. కరితురగసమాకీర్ణము
సరభసబాణోగ్రభంగసహితం బగుసా
గరనిభజన్యమునందుం
బరిమార్చెద నారుణిం దపాచరకర్మున్.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.

## షష్ఠాంకము

(అంతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుఁడు- ఓహో! కాంచనతోరణద్వారముకడ నెవరున్నారు?

ప్రతీహారి- (ప్రవేశించి) అయ్యా! నేను విజయను. ఏమి సెలవు?

కాంచుకీయుఁడు- అమ్మా! నివేదింపుము. నివేదింపుము. వత్సరాజ్యలాభముచేఁ బ్రవృద్ధ మగునభ్యుదయము గలయుదయనమహారాజులకు - మహాసేనునికడనుండి రైభ్యుఁడనుకాంచుకీయుఁడొకఁడు వచ్చియున్నాఁడు. అతఁడును, పూజ్యురా లగునంగారవతీ దేవిగారిచేఁ బంపఁబడినవాసవదత్తదాది, వసుంధర యనుపేరుగల దియు ద్వారముకడ వేచి యున్నారని.

ప్రతీహారి- అయ్యా! రాజుతో విన్నవించుట కిది తావు కాదు. వేళయుఁ గాదు.

కాంచుకీయుఁడు- ఎట్లు?

ప్రతీహారి- అయ్యా! వినుఁడు. నేఁడు మహారాజులుంగారు శయ్యాగృహమునకుఁ బోయి యుండఁగా నక్కడ నెవరో వీణ వాయించుచుండిరి. అది విని మహారాజులుంగారు 'ఘోషవతీనాదమువలె వినవచ్చుచున్నదే' అని యనిరి.

కాంచుకీయుఁడు- తరువాత తరువాత?

ప్రతీహారి- తరువాత నక్కడకుఁ బోయి యావీణ వాయించు చున్నవాని ని ట్లడిగిరి- 'ఈవీణ నీ కెక్కడిది?' అని. అతఁ డిట్లు చెప్పెను- 'నర్మదాతీరమునందుఁ గూర్చు గుల్మలగ్న మై యిది నా కగపడినది. మీా కిది కావలయు నేనిఁ బుచ్చుకొనుఁడు' అని. దానిని గైకొని తొడపై నిడుకొని మహారాజులుంగారు మూర్ఛ పొందిరి. తరువాతఁ గొంతవడికిఁ దేరుకొని కన్నీటిచే నిండిన మొగముతో మహారాజులుంగా రిట్లు చెప్పిరి- 'ఘోషవతీ! నీ వగపడితివి. ఆమె మాత్ర మగపడుట లేదు' అని. అయ్యా! యిందుచే నిది సమయము గాదు. ఎట్లు దీని నివేదింతును?

కాంచుకీయుఁడు- అమ్మా! నివేదింపుము. ఇది కూడ దానికి సంబంధించినట్టిదే.

ప్రతీహారి- అయ్యా! ఇదిగో నివేదించుచున్నాను. శయ్యా గృహమునుండి మహారాజులుంగారిటే వచ్చు చున్నారు. అందుచే నిక్కడే నివేదింతును.

కాంచుకీయుఁడు- అమ్మా! అట్లే.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది మిశ్రవిష్కంభము.

(అంత రాజును, విదూషకుఁడును ప్రవేశింతురు)

రాజు-

చ. చెలి జఘనస్థలంబునను జె న్నైస
లారుకుచద్వయంబునన్
సలలితలీల సుప్తిఁ గను
సత్కృతిఁ గాంచినవీణ! కానన
స్థలి విహగాళి రేచినరజంబు
శరీరమునందుఁ గ్రమ్మఁగా
సలిపితి వే తెఱంగునను
సాధ్వసపూర్ణ మరణ్యవాసమున్.

మఱియు- ఓఘోషవతీ! నీ వస్నిగ్ధురాలవు సుమా!

ఏలన నాతపస్విని—

చ. తనయొడి నిన్నుఁ జేర్చుతఱిఁ
దద్ద యొసంగెడుపార్శ్వపీడలన్
ఘనతరదుఃఖమందుఁ జను
కట్టునఁ జేరుచుకౌఁగిలింతలన్
నను విరహార్తిఁ బేర్కొనుట,
నాపయిఁ బాడుట, సస్మితంబుగాఁ
జనవున మాటలాడుటలు
సర్వము నీ వల విస్మరించుటన్.

విదూషకుఁడు- ఆర్యా! ఇప్పు డీక నతిమాత్రముగ సంతాపము చెందవలదు.

రాజు- వయస్యా! అట్లు కాదు. అట్లు కాదు.

క. చిరకాలము నిదురించిన
వరకామము వీణచేతఁ బ్రతిబోధితమై
పరఁగెడు - నీవీణను నే
తరుణి ప్రియంపడునో దానిఁ దగఁ గోల్పడితిక్.

వసంతకా! శిల్పిజనముకడ నిచ్చి ఘోషవతిని జక్కఁగాఁ గూర్పించి త్వరగాఁ దీసికొని రమ్ము.

విదూషకుఁడు- తమ సెలవుప్రకారము.

(వీణను గ్రహించి నిష్క్రమించును)

ప్రతీహారి- జయము మహారాజులుంగారికి. మహాసేనునికడ నుండి రైభ్యుఁడను కాంచుకీయుఁడును - అంగారవతీ దేవమ్మగారిచేఁ బంపఁబడినది, వాసవదత్తదాది, వసుంధర యనుపేరు గలదియు వచ్చి ద్వారముకడ వేచి యున్నారు.

రాజు- సరియే! పద్మావతిని బిలుచుకొని రమ్ము.

ప్రతీహారి- చిత్తము. (నిష్క్రమించును)

రాజు- మహాసేనుని కీవృత్తాంత మప్పుడే యెట్లు తెలిసినది?

(అంతఁ బద్మావతియుఁ బ్రతీహారియుఁ బ్రవేశింతురు)

ప్రతీహారి- రాజకుమారీ! రమ్ము. రమ్ము.

పద్మావతి- ఆర్యపుత్రులకు జయము.

రాజు- పద్మావతీ! మహాసేనునికడనుండి రైభ్యుఁడను కాంచుకీయుఁడును, నాతనితోఁ బూజ్యురా లగునంగా

రవతీదేవమ్మగారిచేఁ బంపఁబడినది, వసుంధర యను పేరు గలది యగువాసవదత్తదాదియు వచ్చి ద్వారముకడ వేచియున్నా రని నీవు వింటివా ?

పద్మావతి- ఆర్యపుత్రా! బంధుజనముయొక్క కుశలవృత్తాంతమును వినుట నాకు మిక్కిలి ప్రియము.

రాజు- 'వాసవదత్త స్వజనము నాకు స్వజన' మని నీవు చెప్పినది మిక్కిలి చక్కఁగా నున్నది. పద్మావతీ! కూర్చుండుము. ఏమి కూర్చుండవు ?

పద్మావతి- ఆర్యపుత్రా! నాతోఁ గూడఁ గూర్చుండియే యీజనమునకు దర్శన మిత్తురా ?

రాజు- ఇందు దోష మే మున్నది ?

పద్మావతి- ఆర్యపుత్రుల ద్వితీయపరిగ్రహ మని చులుకనగాఁ దోఁచును.

రాజు- కళత్రదర్శనము చేయఁదగినవారిని గళత్రదర్శనము నుండి పరిహరించిన గొప్ప దోష మగును. అందుచేఁ గూర్చుండుము.

పద్మావతి- ఆర్యపుత్రుల సెలవుప్రకారము. (కూర్చుండి) ఆర్యపుత్రా ! నాన్నగారును, నమ్మగారును నే మని చెప్పి పంపి యుందురో కదా యని యుద్విగ్నముగా నున్నది.

రాజు- పద్మావతీ! అవును.

ఉ. చిత్తము పొక్కు నే మనుచుఁ
చెప్పుదురో యని - వారిపుత్త్రి నే

నొ త్తి హరించి తెచ్చియును
నోముఁగ నైతి నదృష్టహీనతం,
ద త్తర మంత్రి పెద్దల ఘనం
బగునమ్మిక వీఁగి పోయి నే
బి త్తరి నయ్యెదం జనకు
పేరలుకం గనుపుత్త్రిపోలికన్.

పద్మావతి- కాలము ప్రాప్తించినపుడు దేనినిగూడ రక్షించు టకు సాధ్యము కాదు.

ప్రతీహారి- ప్రభూ! కాంచుకీయుఁడును, దాదియు ద్వారముకడ వేచియున్నారు.

రాజు- తొందరగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీహారి- ఏలినవారి సెలవుప్రకారము.

(నిష్క్రమించును)

(అంతఁ గాంచుకీయుఁడును, దాదియుఁ, బ్రతీహారియుఁ బ్రవేశింతురు.)

కాంచుకీయుఁడు- అహో!

మ. తన కోలోప్పియినవత్సరాజ్య
మది ప్రాప్తం బయ్యె సంబంధికం
చును సంతోష మెసంగెఁ
దోడనె మదిన్ శోకంబు రెట్టించె మా
జననాథో త్తముపుత్త్రి కైన
వెత నిచ్చం జక్క నూహించినం

దన కేకార్య మసాధ్య మా
జగతి ? నాత్మప్రాప్తరాజ్యంబులోఁ
దనరం దేవికి సేమముం
గలిగినం దైవంబ ! చిత్రంబుగా.

ప్రతీహారి- వారుగో యేలినవారు ! అయ్యా ! సమీపింపుఁడు.
కాంచుకీయుఁడు-(సమీపించి) మహారాజులుంగారికి జయము.
దాది- ఏలినవారికి జయము.
రాజు- (సబహుమానముగా) అయ్యా !

క. సదయుండు రాజవంశ్యుల
యుదయాస్తమయప్రభుండు నుర్వీస్థలిలో
మది కెక్కు బందుగుగ న
న్నదఁ గోరినవాఁడు సేమమే గద చెపుమా !

కాంచుకీయుఁడు- చిత్తము. మహాసేనులు కుశలముగానే యున్నారు. ఇక్కడ నందఱిసేమముల నడుగుచున్నారు.
రాజు- (ఆసనముమీఁదినుండి లేచి) మహాసేనుఁ డే మని సెల విచ్చెను ?
కాంచుకీయుఁడు- వైదేహీపుత్రుని కిది యెంతయుఁ దగి యున్నది. మహాసేనుల సందేశమును దా మాసనమునఁ గూర్చుండియే వినవచ్చును.
రాజు- మహాసేనుల సెలవుప్రకారము. (కూర్చుండును)

కాంచుకీయుఁడు- అదృష్టవశమున శత్రువులచే నపహరింపఁ
బడినరాజ్యమును మఱలఁ బొందినందులకు మి
మ్మభినందించుచున్నా మని. ఏలన—

గీ. పిఱికివారు నశక్తు లాపురుషులందుఁ
దనర దేనాఁడు నుత్సాహ మనుగుణంబు
పురుషు లెవ్వార లుత్సాహపూర్ణు లగుదు
రరసి వారలఁ దగ రాచసిరి వరించు.

రాజు- అయ్యా! ఇది యంతయు మహాసేనుల ప్రభావము.
ఏలనఁగా—

చ. మును పోకసారి యుద్ధమునఁ
బూర్తిపరాజయ మొంద నన్నుఁ దాఁ
దనయులలోన నొక్కఁడుగ
ధార్మికుఁ డాపతి బుజ్జగించెఁ ద
త్తనయ హరించి తెచ్చియును
దానిని గావఁగ నైతిఁ దన్మతిఁ
వినియును నాయెడం బ్రియము
వీడఁడు నేఁ డిట వత్సదేశముం
గనుటకుఁ గూడ నాపతియె
కారణ మాఁ గద యెంచి చూచినన్.

కాంచుకీయుఁడు- ఇది మహాసేనుల సందేశము. దేవీసందే
శము నీపూజ్యురాలు తెలుపఁగలదు.

రాజు- అమ్మా!

క. పదునార్గురు రాణులఁ బెం
పొదవెడుపుణ్యంపుఁదల్లి పుర దేవత మ
త్సదతీప్రవాసదుఃఖా
ర్త దయామతి సేమమే గదా చెప్పు తగన్.

దాది- మహారాణిగా రారోగ్యముగానే యున్నారు. ఇచ్చట నెల్లవారల కుశలవృత్తాంతము నామెగారు తమ్మడుగుచున్నారు.

రాజు- ఎల్లవారల కుశల మనియా? అమ్మా! కుశల మిట్టిది!

దాది- ప్రభువులవారెక్కువగా విచారింపవల దని ప్రార్థన.

కాంచుకీయుఁడు- మహారాజా! ఊఱడిల్లుఁడు. మరణించిన దయ్యుఁ దా మింతగా నామెంగూర్చి సంతాపించుచుండుటచే మహాసేనపుత్రి జీవించి యున్నట్లే సంతోషము కల్గుచున్నది.

చ. ఎవని నెవండు కావ నగు
మృత్యువు నెత్తిని గూరుచున్నచోఁ,
దవిలినత్రాడు మధ్య తెగి
దబ్బునఁ గూలెదు చేఁదబిందెఁ దా
నెవఁడు సమర్థుఁ డౌ నిలుప,
నిట్టులె లోకము తుల్యధర్మ మౌఁ,
జివురులు పెట్ట నొక్కటతి
ఛేదము నందు వనాళి యొక్కటన్.

రాజు- అయ్యా! వలదు. అట్లనవలదు.

గీ. అలమహాసేన రాజన్యు ననుఁగుఁబుత్రి,
నాకు నచ్చినశిష్యయు, నాదు దేవి,
కూర్చుప్రియురాలు నాకు, నా కువలయాక్షిఁ
దలఁప కెటు లుందు నుత్తరోత్తరభవముల.

దాది- మహారాణులుంగా రిట్లు చెప్పిరి. వాసవదత్త మరణించినది. నాకుఁ గాని, మహాసేనునికిఁ గాని గోపాలకపాలకు లెట్లో నీవు నట్లు. తొలినుండియు నీవు మాకల్లుఁడవు కావలయు నని మేము కోరుచుంటిమి. అందు కనియే నిన్నుజ్జయినికిఁ దెచ్చితిమి. అగ్నిసాక్షి గాకుండఁగనే వీణావ్యపదేశమున నామెను నీ కొసఁగితిమి. నీ చాపల్యముచేతనే వివాహము జరుపకుండఁగనే నీవు వెళ్ళిపోయితివి. అతరువాత మీ యిరువురి ప్రతికృతులను జిత్రఫలకములపైఁ జిత్రింపఁజేసి మేము వివాహము జరపితిమి. ఆ చిత్రఫలకముల నిపుడు నీ సన్నిధికిఁ బంపుచున్నాము. వానిని జూచుచు నీ వూఱడిల్లుము.

రాజు- ఆహా! మహారాణి చెప్పినది యతిస్నిగ్ధముగాను, ననురూపముగాను నున్నది!

గీ. తప్పు చేసినమాయందు దయ దలంచి
నెయ్యమును విస్మరింపక నిందుమదిని
రాజ్ఞి పుత్తెంచునీవార్త రాజ్యలాభ
శతముకంటెను సంతోషజనక మయ్యె.

పద్మావతి- ఆర్యపుత్రా! చిత్రగత మయినగురుజనమును జూచి నమస్కరింపఁ గోరుచున్నాను.

దాది- రాజకుమారీ! చూడుము. చూడుము.

(చిత్రఫలకమును జూపును)

పద్మావతి- (చూచి తనలో) ఆహా! ఆర్య యావంతిక నిది యెంతయుఁ బోలియున్నది! (ప్రకాశము) ఆర్యపుత్రా! పూజ్యురాలి నిది యెంతయుఁ బోలియున్నది కదా!

రాజు- పోలి యుండుటయే కాదు. అచ్చముగా నామెయే యని భావించుచున్నాను. కటా! కష్టము!

ఆ. నిద్ద మయినయిట్టినిరుపమరూపంబు
ఘోర మగువిపత్తిఁ గూరె నెట్లు?
ముచ్చ టయినయిట్టి మొగముమాధుర్యంబు
వీఁగె నెట్లు జాతవేదుచేత.

పద్మావతి- ఆర్యపుత్రుల ప్రతికృతిని జూచినపిదప నిది యామెను బోలియున్నదా లేదా యని చెప్పఁగలను.

దాది- రాజకుమారీ! చూడుము. చూడుము.

పద్మావతి- (చూచి) ఆర్యపుత్రుల ప్రతికృతి నిది పోలి యుండుటచే నిదియు నార్యురాలిని బోలియుండు నని విశ్వసించుచున్నాను.

రాజు- దేవీ! చిత్రమును జూచినప్పటినుండి ప్రహృష్టురాలవు గను, నుద్విగ్నురాలవుగను జూపట్టుచున్నావు. ఏమిది?

పద్మావతి- ఆర్యపుత్రా! ఈ ప్రతికృతిని బోలిన యొక స్త్రీ రత్న మిచ్చటనే వసించుచున్నది.

రాజు- ఏమి! వాసవదత్త ప్రతికృతిని బోలినదా?

పద్మావతి- అవును.

రాజు- అయిన శీఘ్రముగా నామె నిటకుఁ గొనితెమ్ము.

పద్మావతి- ఆర్యపుత్రా! నేను గన్యగా నుండఁగా నెవఁడో యొక బ్రాహ్మణుఁడు తనచెల్లెలని యామెను నాకడ న్యాసముగా నుంచిపోయెను. ప్రోషితభర్తృక యగుట నామె పరపురుషదర్శనమును బరిహరించును. అందుచే నార్యపుత్రులు నాతోఁ గలిసి వచ్చినపు డామెను జూచి తెలిసికొందురు గాక!

రాజు- గీ. ఆమె భూసురసోదరి యగునయేనిఁ
దరుణి యెవతెయొ వాసవదత్త కాదు
ఒకరిఁ బోలినరూపు వే ఱొకరి కుంట
సహజమే కద యీప్రపంచంబునందు.

ప్రతీహారి- (ప్రవేశించి) ఏలినవారికి జయము! ఉజ్జయినినుండి యొక బ్రాహ్మణుఁడు వచ్చి యున్నాఁడు. 'దేవిగారి చేతులయందు నాచెల్లెలిని న్యాసముగా నుంచియున్నాను. ఆమెను బ్రతిగ్రహించుటకై వచ్చియున్నా' ననుచు నాతఁడు ద్వారముకడ వేచి యున్నాఁడు.

రాజు- పద్మావతీ! అతఁ డాబ్రాహ్మణుఁ డై యుండునా?

పద్మావతి- కావచ్చును.

రాజు- అంతఃపురవనద్వారములో నా బ్రాహ్మణిని బ్రవేశపెట్టుము.

ప్రతీహారి- ఏలినవారి సెలవుప్రకారము.

(నిష్క్రమించును)

రాజు- పద్మావతీ! నీవును బోయి యామెను గొనిరమ్ము.

పద్మావతి- ఆర్యపుత్రుల సెలవుప్రకారము.

(నిష్క్రమించును)

(అంత యౌగంధరాయణుఁడును, బ్రతీహారియుఁ బ్రవేశింతురు)

యౌగంధరాయణుఁడు- ఆహా! (ఆత్మగతము)

ఆ. పతిహితమ్ముఁబొంచి కడఁతి దాఁచితి నేన
యదియ హితమటంచు నాత్మ నెంచి
కార్యసిద్ధి జయము గల్గినం బార్థివుఁ
డేమి యనునో యనుచు నెద కలంగు.

ప్రతీహారి- అదుగో యేలినవారు! అయ్యా! సమీపింపుఁడు.

యౌగంధరాయణుఁడు- (సమీపించి) జయము మహారాజా! జయము.

రాజు- ఈకంఠస్వరము మును నెపుడో విని యున్నటు లున్నది! ఓ బ్రాహ్మణుఁడా! నీ చెల్లెలు పద్మావతీ హస్తములయందు న్యాసముగా నుంపఁబడినదా?

యౌగంధరాయణుఁడు- చిత్తము.

రాజు- అయిన నీయన చెల్లెలిని శీఘ్రముగాఁ గొని తెండు.

ప్రతీహారి- ఏలినవారి సెలవుప్రకారము.

(నిష్క్రమించును)

(అంతఁ బద్మావతియు, నావంతికయుఁ, బ్రతీహారియుఁ బ్రవేశింతురు)

పద్మావతి- అమ్మా! ఇటు. ఇటు. నీకు మిక్కిలి ప్రియమైనవృత్తాంతమును నివేదింతుము.

ఆవంతిక- ఏమది! ఏమది!

పద్మావతి- నీ సోదరులు వచ్చిరి.

ఆవంతిక- మహాభాగ్యము. భగవదనుగ్రహమున నీనాఁటికైన నన్ను స్మరించినాఁడు.

పద్మావతి- (సమీపించి) ఆర్యపుత్రులకు జయము! ఇదిగో న్యాసము.

రాజు- పద్మావతీ! న్యాసమును దిరిగి యిచ్చివేయుము. న్యాసము సాక్షిసమక్షమున సమర్పింపఁ దగును. ఇక్కడఁ బూజ్యుఁ డీరైభ్యుఁడును, బూజ్యురా లీవ మంధరయు సాక్షులు గాఁగలరు.

పద్మావతి- ఆర్యా! యీపూజ్యురాలిని గైకొనుము.

దాది- (ఆవంతికను నిర్వర్ణించి) ఆఁ! రాజకుమారి వాసవదత్త!

రాజు- ఏమి మహాసేనపుత్రియా! దేవీ! పద్మావతితోఁ గూడ నంతఃపురమునఁ బ్రవేశింపుము.

యౌగంధరాయణుఁడు- తగదు. తగదు. ఆమెను లోనికిఁ గొనిపోఁ దగదు. ఈమె నాసోదరి.

రాజు- ఆర్యా! ఏమనుచున్నారు? ఈమె మహాసేన పుత్రి గదా!

యౌగంధరాయణుఁడు- రాజా!

గీ. భరతకులజాతుఁడవు శీలవంతుఁడవును
వినయగరిమఁ జెలంగువివేకి వింక
రాజధర్మదేశికుఁడవు రాజ వగుటఁ
దరుణినిం బల్మిఁ గొంపోక తగదు నీకు.

రా- మంచిది. అట్లైని రూపసాదృశ్యమును బరిశీలింతము గాక! తెరఁ దొలఁగింపుఁడు.

యౌగంధరాయణుఁడు- ప్రభువులకు జయము!

వాసవదత్త- ఆర్యపుత్రులకు జయము!

రాజు- ఆహా! ఇతఁడు యౌగంధరాయణుఁడు! ఈమె మహాసేనపుత్రి!

క. ఇది సత్యమొ స్వప్నంబో
మదిమదిఁ బ్రేయసిని గంటి మఱియొకపరి నే,
నిదివఱ కొకపరి యిట్లే
సుదతిం గని మోసపోయి స్రుక్కితి మిగులన్.

యౌగంధరాయణుఁడు- ప్రభూ! దేవిని దాఁచి యుంచుటచే నేను కృతాపరాధుఁడను. అందులకుఁ బ్రభువులు నన్ను క్షమింపవలెను. (అని పాదములపైఁ బడును)

రాజు- (లేవ నెత్తి) యౌగంధరాయణుఁడవు గదా! నీవు.

మ. కపటోన్మాదముతో భ్రమించి
యును, సంగ్రామంబులన్ శత్రువీ
రపటాటోపము రూపుమాపి
యును, శాస్త్రప్రోక్తమంత్రంబులన్

విపరీతంబుల మాన్పియున్,
మనిచియున్, విశ్వప్రయత్నంబులన్
విపదంభోనిధి లేవ నెత్తితివి
నీవే గాదె మంత్రీశ్వరా!

యౌగంధరాయణుడు- ప్రభువుల భాగధేయముల ననుసరించువారము మేము!

పద్మావతి- ఓహో! ఈమె అక్కగారు! అమ్మా! సఖీజనసముదాయముతోc దెలియమిచే సముదాచారము అతిక్రమించితిని. అందులకుc దలతో మ్రొక్కి నిన్ను క్షమింప వేడుచుంటిని.

వాసవదత్త- (పద్మావతిని లేవ నెత్తి) లెమ్ము. లెమ్ము. సౌభాగ్యవతీ! లెమ్ము. న్యాసధనమను గదా నేను. నీవలనc దప్పేమియును లేదు.

పద్మావతి- అనుగృహీతురాలను.

రాజు- వయస్యా! యౌగంధరాయణా! దేవిని దాcచియుంచుటలో నీయుద్దేశ మేమి?

యౌగంధరాయణుడు- కౌశాంబి నంతను సంరక్షింపవలె నని.

రాజు- అట్లైనc బద్మావతీహస్తమునందు న్యాసముగా నుంచుటకుc గారణము?

యౌగంధరాయణుడు- పుష్పకభద్రాదు లగుజ్యోతిష్కులు పద్మావతి ప్రభువులకు దేవి కాcగల దని చెప్పిరి.

రాజు- ఇది యంతయు రుమణ్వంతునకుc దెలియునా?

యౌగంధరాయణుఁడు– ప్రభూ! ఎల్లరకుఁ దెలియును.

రాజు– ఆహా! రుమణ్వంతుఁ డెంత కఠినుఁడు!

యౌగంధరాయణుఁడు– ప్రభూ! దేవీకుశలవృత్తాంతమును దెలుపుటకై యిపుడే యీరైభ్యుఁడును, నీదాదియు మరలి యుజ్జయినికిఁ బోవుదురు గాక!

రాజు– అట్లు కాదు. అట్లు కాదు. మన మందఱముఁ గలసి పద్మావతితోఁ గూడఁ బోవుదము.

యౌగంధరాయణుఁడు– ప్రభువుల సెలవుప్రకారము.

(భరతవాక్యము)

మంజరీద్విపద

హిమవంతమును వింధ్య మేమహీసతికిఁ
కర్ణకుండలములకరణి శోభిల్లు
వనధిపర్యంతంబు వరలు నేధాత్రి
యాధాత్రి దీని నేకాతపత్రముగ
మారాజసింహుండు మారాజరాజు
శాసించుఁ గాత మాచంద్రతారముగ.

(ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.

స్వప్న నాటకము ముగిసినది.

---

## ఈ గ్రంథమును రచించుసందర్భమున సంప్రతింపఁబడిన గ్రంథములు

సంస్కృతము :

భాసనాటకచక్రము —

మహామహోపాధ్యాయ శ్రీ టి. గణపతిశాస్త్రిగారిచే సంపాదితము.

తిరువనంతపురప్రాచ్యగ్రంథమాలవారిచేఁ బ్రచురితము.

స్వప్నవాసవదత్తము —

శ్రీ జి. కె. రామసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేఁ బరిష్కృతము.

తెలుఁగు :

సంస్కృతకవిజీవితములు —

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.




ఆంధ్రదశరూపకము —

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

ఇంగ్లీషు :

**The two plays of Bhasa—**

The Hon'ble Justice A. S. P. Iyer.

**A study of Bhasa—**

Dr. Pusalkar, Bombay University, Bombay.